[illegible]

[illegible]

[illegible]

[illegible]

(సంస్కృతశ్లోక సమేతము.)

---

గ్రంథకర్త:


ఆదిపూడి సోమనాథరావు,

18 ప్రసన్నవినాయక కోవెలవీధి,

మైలాపూరు. మదరాసు.



మొదటి కూర్పు

1000 ప్రతులు.

శ్రీ కన్యకాపరమేశ్వరీ ముద్రాలయమున ముద్రితము.

ప్రొద్దుటూరు.

1932.




*Price. As 8.* ] [వెల 8 అణాలు.



శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్యులు,
వారిశిష్యులు.

# విన్నపము.

పరమేశ్వరుని గూర్చిన జ్ఞానము, భక్తి, సేవ యీమూఁడే లోక కల్యాణమునకు ముఖ్యసాధనములు. కాఁబట్టియే పరమ కరుణాళువగు పరమేశ్వరుఁడు మనకు మువ్వురినే యాచార్యులను బ్రసాదించి యున్నాఁడు. శ్రీమచ్ఛంకరులు కేవలము జ్ఞానమునుగూర్చి మిక్కిలి నొక్కి చెప్పినను దమ పవిత్రమైన జీవితమునందు భక్తిని సేవనే చూపియున్నారు. శ్రీమద్రామానుజులు కేవలము భక్తినే ప్రాధాన్యముగాఁ జెప్పినను దమ పావనమైన జీవితమునందు జ్ఞానమునకును, సేవకును గావలసినంత యవకాశ మొసంగియే యున్నారు. శ్రీమన్మధ్వులు సేవనే ముఖ్యముగా బోధించినను భక్తిజ్ఞానములను దమ నిర్మల జీవితమునందుఁ బ్రకటింపక పోలేదు. కాఁబట్టి మనకీ మువ్వురాచార్యులును ఆదర్శమూర్తులే. శ్రీశంకరుల నిర్మల జ్ఞానమును, శ్రీరామానుజుల నిర్మల భక్తిని శ్రీమధ్వుల నిర్మల సేవానిరతిని మనము సంపాదించుకొనవలయును. శంకరులు గోరినది సాయుజ్యముక్తి. రామానుజులు గోరినది సారూప్యముక్తి మధ్వులు గోరినది సామీప్యముక్తి. మనకుఁ గావలసినది సమస్తదుర్గుణములనుండి విముక్తి

శంకరులకు జనకునివంటి జ్ఞాని గావలయును. రామానుజులకుఁ బ్రహ్లాదునివంటి భక్తుఁడు గావలయును మధ్వులకు హనుమంతునివంటి సేవకుఁడు గావలయును. మనమో యీమువ్వురి తత్త్వమును సమన్వయించుకొని లోక కల్యాణమునకుఁ బాటుపడవలయును.

# II

శ్రీ శంకరాచార్యులవారి

ఏకా నారీ సుందరీ వా దరీ వా
ఏకం మిత్రం భూపతిర్వా యతిర్వా
ఏకో వాసః పత్తనం వా వనం వా
ఏకో దేవః కేశవో వా శివో వా.

అరయఁగా నారి యొకతె సుం ♦ దరియొ దరియొ
వసుధ మిత్రుండొకండె భూ ♦ పతియొ యతియొ
ధారుణి నివాస మొకటె ప ♦ త్తనమొ వనమొ
జగతి దేవుఁడొకండె కే ♦ శవుఁడొ శివుఁడొ.

ఈ శ్లోకము వారి మహోదార భావమును వెల్లడి చేయుచున్నది. ఈ భావమునే యందఱి హృదయారవిందములలో నెలకొల్పవలయునను సదుద్దేశముతో వారిచే రచింపఁబడిన భక్తి రస పూరితములైన శ్రీగోవింద మంజరి శ్రీ శివానందలహరి యను కృతి రత్నంబుల రెంటిని నా నేర్చుకొలఁది తెనిఁగించి యనేక సదభిప్రాయములలో నాతో నేకీభవించు మన్మిత్ర రత్నమగు శ్రీ మరూరు లక్ష్మీనరసప్ప పంతులుగారికి సంకితమొనర్చితిని. పరమేశ్వరుని కరుణచే నీ గ్రంథరాజద్వయంబును భక్తజన హృదయ రంజకంబై సదా వర్ధిల్లును గాక.

ఆంధ్రు లందఱు దీనిని ధారాళముగ నుపయోగించు కొందురు గాక.

ఇట్లు విన్నవించు విధేయుఁడు.
ఆదిపూడి సోమనాధరావు.

# అంకితము.

## సీస పద్యము.

శ్రీసరస్వతులచేఁ ♦ జెన్నారు చున్నారు
లోకాన నందవ ♦ రీకు లెన్న
నధికారముల యందు ♦ నలరారుచున్నారు
లోకాన నందవ ♦ రీకు లెన్న
దాన ధర్మమ్ములఁ ♦ దనరారు చున్నారు
లోకాన నందవ ♦ రీకు లెన్నఁ
బరమేశ్వరుని భక్తి ♦ భాసిల్లు చున్నారు
లోకాన నందవ ♦ రీకు లెన్న

గీ॥ విజయపురవర శ్రీకృష్ణ ♦ విభుని చేత
నాంధ్రకవితా పితామహుఁ ♦ డన్న బిరుదుఁ
గన్న యాయల్లసాని పె ♦ ద్దన్న ఘనుఁడు
లోకవిదితుఁడు నందవ ♦ రీకుఁ డెన్న.

గీ॥ ఖ్యాతమైనట్టి యాకుల ♦ మందు బుట్టి
శ్రీమదూరుల సన్నామ ♦ గృహమునకును
భూషణంబయి యెంతయుఁ ♦ బొలిచినావు
మించు సుగుణాల కుప్ప! ల ♦ క్ష్మినరసప్ప!

## II

గీ॥ కాన హరి హర భక్తి నీ ◆ మానసమును
భావనముఁ జేయుమనెడి వి ◆ శ్వాసమునను
దనరు గోవింద మంజరిన్ ◆ దాని తోడ
శ్రీశివానందలహరి నీ ◆ స్నేహమెంచి

గీ॥ సరళముగ భావములనెల్ల ◆ స్పష్టపడఁగఁ
దేట గీతములందు నేఁ ◆ దెనుఁగుఁ జేసి
యంకితం బిత్తుఁ గొనుము వి ◆ ఖ్యాతిఁ గనుము
భాషకున్ వాసిఁ దెచ్చిన ◆ వాఁడ వగుచు.

గీ॥ నిన్ను నీధర్మపత్నిని ◆ నీదు పరమ
పూజ్య మాతను సుతులను ◆ బుత్రికలను
బంధువులఁ బ్రోచుగాత శు ◆ భమ్ములిడుచు
సతము సర్వేశ్వరుండు శ్రీ ◆ శంకరుండు.

ఆదిపూడి సోమనాథరావు.



శ్రీ

# గోవిందమంజరి.

(ద్వాదశశ్లోకమంజరీ.)



శ్లో. భజ గోవిన్దం భజ గోవిన్దం
భజ గోవిన్దం మూఢమతే,
సంప్రాప్తేసన్నిహితే కాలే
నహి నహి రక్షతి డుకృఙ్కరణే.

శ్లో. మూఢ జహీహి ధనాగమతృష్ణామ్
కురు సద్బుద్ధిం మనసి వితృష్ణామ్,
యల్లభసే నిజకర్మోపాత్తం
విత్తం తేన వినోదయ చిత్తమ్ భజ...కరణే. 1

శ్లో. నారీస్తనభరనాభీదేశమ్
దృష్ట్వా మాగా మోహావేశమ్,
ఏతన్మాంసవసాదివికారం
మనసి విచిన్తయ వారం వారమ్. భజ. 2

శ్రీ

# ఆంధ్ర గోవిందమంజరి.

## (ద్వాదశమంజరి.)

---

### గీత పద్యములు.

అల డుకృఞ్ కరణే సూత్ర ♦ మరసి నిన్నుఁ
గాలమాసన్న మౌతఱిఁ ♦ గావఁ బోదు
గావఁబోదు నిజమ్ముగాఁ ♦ గావఁ బోదు
గొలువు మోమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ.

ధనము నందలి యాశను ♦ దఱిమి వేసి
యాశ లేనట్టి సద్బుద్ధి ♦ నాత్మ నిలిపి
నెమ్మిఁ జేసిన నీదు క ♦ ర్మమ్ము చేతఁ
బ్రాప్తమైన ధనమ్ముతోఁ ♦ దృప్తిఁ నొంది
గొలువు మోమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 1.

సుందరుల నాభికుచముల ♦ సొంపు నింపు
గాంచి వానిని నీవు మో ♦ హించఁ బోకు
కాని యవి మాంస వసల వి ♦ కారమంచు
మాటి మాటికిఁ దలఁచుచు ♦ మానసమునఁ
గొలువు మోమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 2.

శ్లో. నళినీదళగతజల మతితరళమ్
తద్వ జ్జీవిత మతిశయచపలమ్,
విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తమ్
లోకం శోకహతం చ సమస్తమ్. భజ. 3

శ్లో. యావ ద్విత్తోపార్జనసక్త
స్తావ న్నిజపరివారో రక్తః,
పశ్చా జ్జీవతి జర్ఝరదేహే
వార్తాం కోఽపి న పృచ్ఛతి గేహే భజ. 4

శ్లో. యావ త్పవనో నివసతి దేహే
తావ త్పృచ్ఛతి కుశలం గేహే,
గతవతి వాయౌ దేహాపాయే
భార్యా బిభ్యతి తస్మి న్కాయే భజ. 5

శ్లో. అర్థ మనర్థం భావయ నిత్యమ్
నాస్తి తత స్సుఖలేశ స్సత్యమ్,
పుత్రాదపి ధనభాజాం భీతి
స్సర్వ త్రైషా విహితా రీతిః. భజ. 6

జలజ దళగత మైనట్టి ♦ జలము కరణిఁ
జంచలము జీవితమ్మతి ♦ చంచలమ్ము
ఘోర రోగాభిమాన సం ♦ పూరితమ్ము
లోకమంతయుఁ దెలియుము ♦ శోక హతము
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ ౩.

ఓర్చి గడియించు నాసక్తి ♦ యున్న వఱకె
సకల పరివారమును రక్తిఁ ♦ బ్రకట పఱచు
నొడలి యందలి సత్తువ ♦ యుడిగ నేని
ఒక్కరే నింట నడుగువా ♦ రుండఁబోరు
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 4.

తనువులోఁ బ్రాణముండు నం ♦ దాఁక నింట
నడుగు చుందురు సేమమ్ము ♦ నది దొలంగఁ
బడిన దేహమ్ముఁ గాంచి తా ♦ భయము నొందు
వలచి పెండ్లాడినట్టి యా ♦ భార్య కూడఁ
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 5.

అరయు మర్థ మ్మనర్థమం ♦ చాత్మ నెపుడు
సుంతయైనను దీనిచే ♦ సుఖము లేదు
కన్న బిడ్డల వలనను ♦ గలుగు భీతి
ఎల్లెడల ధనికులకు నెల్ల ♦ నిదియె రీతి
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 6.

శ్లో. బాల స్తావ త్క్రీడాసక్త
స్తరుణ స్తావ త్తరుణీసక్తః
వృద్ధ స్తావ చ్చిన్తాసక్తః
పరమే బ్రహ్మణి కోఽపి న సక్తః. భజ. 7

శ్లో. కా తే కాన్తా కస్తే పుత్రః
సంసారోఽయ మతీవ విచిత్రః,
కస్య త్వం వా కుత ఆయాతః
తత్త్వం చిన్తయ త దిహ భ్రాంతః. భజ. ౮

శ్లో. సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వం
నిస్సఙ్గత్వే నిర్మోహత్వమ్,
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః. భజ. 9

శ్లో. వయసి గతే కః కామవికార
శ్శుష్కే నీరే కః కాసారః,
క్షీణే విత్తే కః పరివారో
జ్ఞాతే తత్త్వే క స్సంసారః. భజ. 10

అలరు నాసక్తి బాలుర ♦ కాట లందు
యువకులకుఁ గల్గు నాసక్తి ♦ యువతు లందుఁ
జేరు వృద్ధుల కాసక్తి ♦ చింతలందు
నెవరికాసక్తి యిఁకఁ బర ♦ మేశునందుఁ?
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 7

ఎవతె నీభార్య? కొడుకన ♦ నెవఁడు నీకు?
ఎవని వాఁడవు? వచ్చితి ♦ వెచట నుండి?
అతి విచిత్రమ్ము సంసార ♦ మరసి చూడ
భ్రాంతి యుతమైన దీని త ♦ త్త్వమ్ముఁ దెలిసి
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 8.

సంగ ముడుగును సజ్జన ♦ సంగ మునను
సంగ ముడిగిన మోహమ్ము ♦ సాంత ముడుగు
నుడుగ మోహమ్ము స్థిరతత్త్వ ♦ ముదయ మందుఁ
గాంచఁ దత్త్వమ్ము నిహమందె ♦ కలుగుముక్తి
కొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 9.

కడవ వయసింకఁ గామ వి ♦ కార మేడ?
జలము లింకిన నింకఁగా ♦ సార మేడ?
జారినఁ విత్తమింకఁ బరి ♦ వార మేడ?
జ్ఞానమబ్బిన నింక సం ♦ సార మేడ?
కొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 10.

శ్లో. మాకురు ధనజనయౌవనగర్వం
హరతి నిమేషా త్కాల స్సర్వమ్,
మాయామయ మిద మఖిలం హిత్వా
బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా. భజ. 11

శ్లో. దినయామిన్యౌ సాయంప్రాత
శ్శిశిరవసన్తౌ పునరాయాతః,
కాలః క్రీడతి గచ్ఛత్యాయు
స్తదపి న ముఞ్చత్యాశావాయుః. భజ. 12

శ్లో. ద్వాదశమఞ్జరికాభి రశేషః
కథితో వైయాకరణస్యైషః,
ఉపదేశో౽భూ ద్విద్యానిపుణైః
శ్రీమచ్ఛఙ్కరభగవచ్ఛరణైః. భజ.

ఏకానారీ సుందరీవా దరీవా
ఏకం మిత్రం భూపతిర్వా యతిర్వా
ఏకో వాసః పత్తనం వా వనం వా
ఏకో దేవః కేశవో వా శివో వా.

ధనము యౌవనమును మఱి ♦ జనము లున్న
గర్వపడకుము సర్వముఁ ♦ గాల మొక్క-
నిముసమున గ్రసింగు మాయయియా ♦ నిఖిల జగము
తెలిసి బ్రహ్మపదంబును ♦ గలసి కొనుము
కొలువు మోమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 11.

రాత్రి దివములు సాయముఁ ♦ బ్రాతములును
శిశిరము వసంతములును జె ♦ చ్చెరను దిరుగఁ
గాలము భ్రమించు వయసును ♦ గడచుఁ గాని
యాశయను గాలి తఱుగదు ♦ లేశమైనఁ
గొలువు మోమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 12.

శంకరుని కింకరుండైన ♦ శంకరుండు
ప్రాజ్ఞుఁ డొనరించె వ్యాకర ♦ ణాజ్ఞునకును
ద్వాదశ శ్లోక మంజరీ ♦ ద్వారమునను
సదుపదేశమ్ము విద్యావి ♦ శారదుండు.

అరయఁగా నారియొకతె సుం ♦ దరియొ దరియొ
వసుధ మిత్రుండొకండె భూ ♦ పతియొ యతియొ
ధారుణి నివాసమొకటె ప ♦ త్తనమొ వనమొ
జగతి దేవుం డొకండె కే ♦ శవుఁడొ శివుఁడొ.

---

శ్రీ

# గోవిందమంజరి

(చతుర్దశ శ్లోక మంజరీ.)



పద్మపాదాచార్యుని యుపదేశము

కా తే కాన్తా ధనగతచిన్తా
వాతుల కిం తవ నాస్తినియన్తా,
త్రిజగతి సజ్జనసఙ్గతి రేకా
భవతి భవార్ణవతరణే నౌకా. భజ. 1

తోటకాచార్యునిది.

జటిలో ముణ్డీ లుఞ్ఛితకేశః
కాషాయామ్బరబహుకృతవేషః,
పశ్యన్నపి చ న పశ్యతి మూఢో
హ్యుదరనిమిత్తో బహుకృతవేషః భజ. 2

హస్తామలకాచార్యునిది.

అఙ్గం గళితం పలితం ముణ్డమ్
దశనవిహీనం జాతం తుణ్డమ్,
వృద్ధో యాతి గృహీత్వా దణ్డమ్
తదపి న ముఞ్చత్యాశాపిణ్డమ్. భజ

శ్రీ

# ఆంధ్రగోవిందమంజరి.

## (చతుర్దశ మంజరి.)

---

### గీత పద్యములు.

#### పద్మపాదాచార్యుని యుపదేశము.

భ్రాంత! నీ కేల ధనచింత ♦ కాంతమయ్యె?
స్ఫరినిను నియమించు నీ ♦ యంత లేఁడె?
సర్వజగముల సజ్జన ♦ సంగమంబె
భవసముద్రమ్ము దాటించు ♦ పరమ నౌక
కొలువు మోమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 1

#### తోటకాచార్యుని యుపదేశము.

జటులు బోడులు ఖండకే ♦ శముల వారు
కావి శాటీల వారలుఁ ♦ గలరు గాని
పొట్టకీ వేషములఁ దాల్చు ♦ మూఢులగుటఁ
గాంచియుఁ బ్రహ్మమును వీరు ♦ గాంచకుంద్రు
కొలువు మోమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 2

#### హస్తామలకాచార్యుని యుపదేశము.

సడలెనంగ బలమ్ము శీ ♦ ర్షమ్ము నెఱసె
బోసి నోరయ్యెఁ బ్రాప్తించె ♦ ముసలి తనము
కరమునకు నబ్బె దండమ్ము ♦ కాని యాశ
యనెడు పిండమ్ము వీడక ♦ యుంటి యుండె
గొలువు మోమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 3

సుబోధునిబోధ.

అగ్రే వహ్నిః పృష్ఠే భానుః
రాత్రౌ చుబుకసమర్పితజానుః,
కరతలభిక్ష స్తరుతలవాస
స్తదపి న ముఞ్చ త్యాశాపాశః. భజ 4

వార్తికకారుల యభిప్రాయము.

కురుతే గఙ్గాసాగరగమనమ్
వ్రతపరిపాలన మథవా దానమ్,
జ్ఞానవిహీన స్సర్వమతేన
ముక్తిం న భజతి జన్మశతేన భజ. 5

నిత్యానన్దుని యుపదేశము.

సురమన్దిరతరుమూలనివాస
శ్శయ్యా భూతల మజినం వాసః,
సర్వపరిగ్రహభోగత్యాగః
కస్య సుఖం న కరోతి విరాగః. భజ. 6

ఆనన్దగిరి యుపదేశము.

యోగరతో వా భోగరతో వా
సంగరతో వా సంగవిహీనః,
యస్య బ్రహ్మణి రమతే చిత్తమ్
నన్దతి నన్దతి నన్ద త్యేవ. భజ. 7

## సుబోధుని యుపదేశము.

కాచుకొన ముందు వహ్ని భా ♦ స్కరుఁడు వెనుక
గడ్డమో రాత్రియందు మో ♦ కాళ్ళమీఁదఁ
జేతిలో భిక్ష వాసమో ♦ చెట్టె యైనఁ
పాశమై యాశమాత్రము ♦ పాయదయ్యెఁ
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 4

## వార్తికకారుల యభిప్రాయము.

చెలఁగి గంగాబ్ధి యాత్రలఁ ♦ జేయుచున్న
సకల దానవ్రతమ్ముల ♦ సలుపుచున్న
జ్ఞాన హీనుఁడు నూఱు జ ♦ న్మాల నైన
సర్వమత వేదియైన మో ♦ క్షమ్ముఁ గనఁడు
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 5

## నిత్యానందుని యుపదేశము.

శాంత తరుమూలమే నివా ♦ సమ్ము గాఁగ
ధరయె శయ్యగఁ దోలె వ ♦ స్త్రమ్ము గాఁగ
సర్వభోగ పరిత్యాగ ♦ సరణి మెలఁగు
నట్టి వైరాగ్య మెవనికి ♦ హర్ష మిడదు?
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 6

## ఆనందగిరి యుపదేశము.

యోగియే కాని లేకదా ♦ భోగి కాని
సంగియే కాని లేక ని ♦ స్సంగి కాని
యెవనిమది బ్రహ్మమున రమి ♦ యించుచుండు
నాతఁడే కేవలానంద ♦ మనుభవించుఁ
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 7

దృఢభక్తునిది.

భగవద్గీతా కించి దధీతా
గంగాజలలవకణికా పీతా,
సకృ దపి యేన మురారిసమర్చా
క్రియతే తస్య యమోఽపి న చర్చామ్. భజ 8

నిత్యనాథుని యుపదేశము.

పునరపి జననం పునరపి మరణమ్
పురనపి జననీజఠరే శయనమ్,
ఇహ సంసారే బహుదుస్తారే
కృపయాపారే పాహి మురారే. భజ. 9

యోగానందునిది.

రథ్యా కర్పట విరచితకన్థః
పుణ్యాపుణ్య వివర్జితపన్థాః,
యోగీ యోగ నియోజితచిత్తో
రమతే బాలోన్మత్తవ దేవ. భజ. 10

సురేంద్రుని యుపదేశము.

కస్త్వం కోఽహం కుత ఆయాతః
కా మే జననీ కో మే తాతః,
ఇతి పరిభావిత నిజ సంసార
స్సర్వం త్యక్త్వా స్వప్నవిచారః, భజ 11

దృఢభక్తుని యుపదేశము.

ఎవఁడు గీతను బఠియించు ♦ నించుకేని
క్రోలు నెవ్వఁడు గంగను ♦ గొంచెమేని
ఎవఁడు గొల్చు మురారిని ♦ నెప్పుడేని
అతనిఁ జర్చింపఁ గడఁగఁడు ♦ యముఁడు గూడఁ
గొలువు మోహమూఢ గోవిందుఁ ♦ గూర్మితోడ! ౮.

నిత్యానాథుని యుపదేశము.

మాటిమాటికి జననమున్ ♦ మరణ మిచ్చు
సారెకును మాతృగర్భాన ♦ శయన మొనఁగు
పారమే లేని వార్ధి సం ♦ సార మరయ
నకట దరిఁజేర్చి కావు ము ♦ రారి యంచుఁ
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 9

యోగానందుని యుపదేశము.

పొంత చింపిరి గుడ్డల ♦ బొంతఁ దాల్చి
పాపపుణ్య వివర్జిత ♦ పథముఁ బట్టి
యోగమునఁ జిత్తముంచిన ♦ యోగివరుఁడు
బాలునిన్ వెఱ్ఱి వానిని ♦ బోలె మెలఁగుఁ
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 10

సురేంద్రుని యుపదేశము.

ఈవు నేనెవ్వరము? రాక ♦ యెచటనుండి?
తల్లియెవ్వతె? మఱినాకుఁ ♦ దండ్రి యెవఁడు?
అనుచుఁ జర్చించి కలలోని ♦ యర్థమట్లు
దలఁచి సంసారమెల్లను ♦ దలఁగఁ ద్రోసి
గొలువు మోహమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 11

మేధాతిథి.

త్వయి మయి సర్వత్రైకో విష్ణు
ర్వ్యర్థం కుప్యసి మయ్యసహిష్ణుః,
భవ సమచిత్త స్సర్వత్ర త్వం
వాఞ్ఛ స్యచిరా ద్యది విష్ణుత్వం. భజ. 12.

భారతీవంశుఁడు.

కామం క్రోధం లోభం మోహం
త్యక్త్వాత్మానం పశ్యతి సోఽహం,
ఆత్మజ్ఞానవిహీనా మూఢా
స్తే పచ్యన్తే నరకనిగూఢాః. భజ. 13

గేయం గీతా నామ సహస్రమ్
ధ్యేయం శ్రీపతిరూప మజస్రమ్,
నేయం సజ్జనసఙ్గతి మనిశమ్
దేయం దీనజనాయ తు విత్తమ్. భజ. 14.

మూఢః కశ్చన వైయాకరణో
డుకృఞ్ కరణాధ్యయనధురీణః,
శ్రీమచ్ఛఙ్కరభగవచ్ఛిష్యై
ర్బోధిత ఆసీ చ్ఛోధితకరణః. భజ. 15

## మేధాతిథి యుపదేశము.

అలరు నీనా యెడఁగ విష్ణు ♦ వెల్ల యెడల
నిడి యోపిక కినియుదు ♦ వృథగ నన్నుఁ
ద్వరగ విష్ణుత్వ మందఁగాఁ ♦ దలఁతు వేని
వరఁగి సమబుద్ధితోడ స ♦ ర్వమ్ము నందుఁ
గొలువు మోమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 12

## భారతీశుని యుపదేశము.

అలుక కామము లోభ మో ♦ హములు లేసి
యుతఁడె నేనని సుజ్ఞాని ♦ యాత్మఁ గాంచు
నాత్మవిజ్ఞానహీన మూ ♦ ఢాత్ము లెన్న
నొందు నరకాగ్నిలోఁ బడి ♦ మ్రగ్గుచుంద్రు
గొలువు మోమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 13

గీత నామ సహస్రమ్ము ♦ గేయమంచు
అనయము శ్రీపతిరూపమ్ము ♦ ధ్యేయమంచు
చిత్తమును సాధుసంగతి ♦ నేయుమంచు
ధనము దీనాళికిం దేయు ♦ మనుచుఁ దెలిసి
గొలువు మోమూఢ! గోవిందుఁ ♦ గూర్మితోడ. 14

పర డుకృఞ్ కరణే సూత్ర ♦ పాఠమందె
ప్రజ్ఞ మాపెడు వ్యాకర ♦ ణాజ్ఞుఁ డంత
శంకరాచార్య శిష్యులు ♦ సలిపి నట్టి
బోధ చేనమ్యో నింద్రియ ♦ శోధకుండు.

ఆంధ్రగోవిందమంజరి సంపూర్ణము

---

శ్రీ

# శివానందలహరి.



కలాభ్యాం చూడాలంకృతశశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటితఫలాభ్యాం భవతు మే,
శివాభ్యా మస్తోకత్రిభువనశివాభ్యాం హృది పున
ర్భవాభ్యా మానందస్ఫురదనుభవాభ్యాం నతి రియమ్ 1.

గళంతీ శంభో త్వచ్చరితసరితః కిల్బిషరజో దళంతీ
ధీకుల్యాసరణిషు పతంతీ విజయతామ్,
దిశంతీ సంసారభ్రమణపరితాపోపశమనం వసంతీ
మచ్చేతో హ్రదభువి శివానందలహరీ. 2.

త్రయీవేద్యం హృద్యం త్రిపురహర మాద్యం త్రిణయనం
జటాభారోదారం చలదురగహారం మృగధరమ్,
మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిం
చిదాలంబం సాంబం శివ మతివిడంబం హృది భజే. 3

శ్రీ

# ఆంధ్రశివానందలహరి.

## గీతపద్యములు.



కళలరూపొంది శశికళల్ ♦ దలలఁ దాల్చి
వరతపః ఫలమూర్తులై ♦ భక్తతతికి
వరములిడి లోకములకు శు ♦ భమ్ము లొసఁగి
మాటి కానంద రూపముల్ ♦ మదికిఁ జూపు
శివుల కిర్వురకును నమ ♦ స్కృతి నొనర్తు. 1

నీచరిత్రంపు నదిఁ బుట్టి ♦ నిఖిల పాప
పాంసుల నడంచి తెల్వికా ♦ ల్వఁబడి పాఱి
సాంబ! సంసారతాపోప ♦ శమన మొసఁగి
వచ్చి నామది మడుఁగులోఁ ♦ జొచ్చియున్న
యీ శివానందలహరి దా ♦ నెసఁగుఁగాత. 2.

త్రిపురహరు వేదవిద్వేద్యు ♦ హృద్యు నాద్యు
వరజటాధారు మృగధరు ♦ నురగహారు
సదయ భావు మహాదేవు ♦ సాంబు సులభుఁ
బశుపతిఁ ద్రినేత్రుఁ బరమ పా ♦ వనచరిత్రు
శివుఁ జిదానందుఁ గొల్తు మ ♦ చ్చిత్తమందు. 3

సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదా
నమన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృతఫలమ్,
హరిబ్రహ్మాదీనా మపి నికటభాజా మసులభం
చిరం యాచే శంభో శివ తవ పదాంభోజభజనమ్. 4.

స్మృతౌ శాస్త్రే వైద్యే శకున కవితాగానఫణితౌ
పురాణే మంత్రేవా స్తుతి నటన హాస్యే ష్వచతురః,
కథం రాజ్ఞాం ప్రీతి ర్భవతి మయి కోఽహం పశుపతే
పశుం మాం సర్వజ్ఞ ప్రథితకృపయా పాలయ విభో. 5.

ఘటో వా మృత్పిండోఽప్యణు రపి చ ధూమోఽగ్నిరచలః
పటో వా తంతు ర్వా పరిహరతి కిం ఘోరశమనమ్,
వృథా కంఠక్షోభం వహసి తరసా తర్కవచసా
పదాంభోజం శంభోర్భజ పరమసౌఖ్యం వ్రజ సుధీః. 6.

మనస్తే పాదాబ్జే నివసతు వచ స్తోత్రఫణితౌ
కరశ్చాభ్యర్చాయాం శ్రుతిరపి కథాకర్ణనవిధౌ,
తవ ధ్యానే బుద్ధి ర్నయనయుగళం మూర్తివిభవే
పరగ్రంథా న్కైర్వా పరమశివ జానే పరమతః. 7.

అల్ప ఫలముల నిచ్చెడు ♦ నట్టివారు
వేల్పు లున్నారు జగతిలో ♦ వేన వేలు
వారిఁ గొల్వను గలనైన ♦ ఫలముఁ గోరి
హరికి బ్రహ్మాదులకును ల ♦ భ్యమ్ము కాని
శివ! భవత్పాదసేవ యా ♦ చింతు సతము. 4.

చతురుఁడనుగాను స్మృతిశాస్త్ర ♦ చయమునందు
గాన మంత్రాగద పురాణ ♦ కవితలందు
హాస్య సంస్తుతి శకున నా ♦ ట్యముల యందుఁ
గాన నేనెవ్వఁడని నృపుల్ ♦ గరుణఁ గాంతు
పశుపతీ! కృపఁగావుమీ ♦ పశువునన్ను. 5.

ఘటము మృత్పిండ మణువులు ♦ పటము తంతు
వచల ధూమాగ్నులనెడు వా ♦ జ్ఞిచయములను
దలఁగునే యమబాధ? యీ ♦ తర్కమేల?
కంఠశోషణమేల? శ్రీ ♦ కంఠపాద
వనజములఁ గొల్చి సన్మతీ! ♦ గనుముముక్తి. 6.

చేత మీశ్వర! నీపదా ♦ బ్జాతమందుఁ
బలుకు నుతులందుఁ గరములు ♦ గొలువునందు
వీను లెప్పుడు నీకథల్ ♦ వినుటయందు
బుద్ధి నీధ్యానమందు నీ ♦ మూర్తి విభవ
మందుఁ గనులున్న నింక గ్రం ♦ థాదు లేల? 7.

యథా బుద్ధి శ్శుక్తౌ రజత మితి కాచాశ్మని మణి
ర్జలే పైష్టే క్షీరం భవతి మృగతృష్ణాసు సలిలమ్,
తథా దేవభ్రాంత్యా భజతి భవదన్యం జడజనో
మహాదేవేశం త్వాం మనసి చ న మత్వా పశుపతే. ౮.

గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలే చ భ్రమతి కుసుమార్థం జడమతిః,
సమర్ప్యైకం చేత స్సరసిజ ముమానాథ భవతే
సుఖే నావస్థాతుం జన ఇహ న జానాతి కి మహో. 9.

నరత్వం దేవత్వం నగవనమృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాదిజననమ్,
సదా త్వత్పాదాబ్జ స్మరణపరమానందలహరీ
విహారాసక్తం చే ద్ధృదయ మిహ కిం తేన వపుషా. 10.

వటు ర్వా గేహీ వా యతి రపి జటీ వా తదితరో
నరో వా యః కశ్చి ద్భవతు భవ కిం తేన భవతి,
యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే
తదీయస్త్వం శంభో భవసి భవభారం చ వహసి. 11.

వెలుఁగు ముత్తెపుఁ జిప్పను • వెండి యనుచు
నిగ్గులీనెడు గాజు మా • ణిక్య మనుచు
నెండమావులు జలమని • పిండి నీరు
పాలనెడు భ్రాంతి నీకంటెఁ • బరుని జడుఁడు
దేవుఁడను భ్రాంతిఁ గొలుచును • దెలియక భవ! 8.

భీకరారణ్యములను గం • భీర జలము
గలుగు కొలఁకుల గొప్ప న • గమ్ములందుఁ
దిరుగు చుందురు మూర్ఖులు • విరుల కొఱకుఁ
జేతమను తమ్మి నీశ్వరా! ప్రీతినీకు
నర్పణము చేసి సుఖియించు • నేర్పుఁగనరు. 9.

సాంబ సురనర పశుపక్షి • జన్మములను
దేనిఁ బొందినఁ గూడ నా మానసంబు
సర్వదా శంభు! నీపాద • సరసిజముల
నెంచి యానందమున విహ • రించు చున్న
నదియె చాలును దేహ మే • దైన నేమి? 10.

వటువొ గేస్తువొ యతియొ తా • పసుఁడొ యాతఁ
డెవ్వఁడే కాని హృత్పద్మ • మెలమి నీకు
వశము చేసిన వాని నీ • వాని గాఁగఁ
దలఁచి తద్భవ భారమ్ముఁ • దాల్తువెపుడు
శంకరా! సర్వసద్భక్త • సంకటహర! 11.

గుహాయాం గేహే వా బహి రపి వనే వాఽద్రిశిఖరే
జలే వా వహ్నౌ వా వసతు వసతేః కిం వద ఫలమ్,
సదా యస్యైవాంతఃకరణ మపి శంభో తవ పదే
స్థితం చేద్యోగోఽసౌ స చ పరమయోగీ స చ సుఖీ. 12.

అసారే సంసారే నిజభజనదూరే జడధియా
భ్రమంతం మా మంధం పరమకృపయా పాతుముచితమ్,
మదన్యః కో దీన స్తవ కృపణరక్షాతినిపుణః
త్వదన్యః కో వా మే త్రిజగతి శరణ్యః పశుపతే. 13.

ప్రభుస్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే
ప్రముఖ్యోఽహం తేషామపి కిముత బంధుత్వ మనయోః,
త్వయైవ క్షంతవ్యాః శివ మదపరాధా శ్చ సకలాః
ప్రయత్నాత్కర్తవ్యం మదవన మియం బంధుసరణిః. 14.

ఉపేక్షా నో చే త్కిం న హరసి భవద్ధ్యానవిముఖాం
దురాశాభూయిష్ఠాం విధిలిపి మశక్తో యది భవాన్,
శిర స్త ద్వైధాత్రం ననఖలు సువృత్తం పశుపతే
కథం వా నిర్యత్నం కరనఖముఖే నైవ లులితమ్. 15

గృహమొ కుహరమొ వనశైల ♦ శృంగతటమొ
యగ్నియొ జలంబొ వాస మే ♦ దైననేమి?
మనసు శంకర! నీపాద ♦ వనజమందు
నెమ్మి వసియింప నదియె యో ♦ గమ్ము సుమ్ము
వాఁడె కేవలముగ యోగి ♦ వాఁడె భోగి. 12.

సారమే లేక నీనుండి ♦ దూరమైన
కఠిన సంసారమునఁ దిరు ♦ గాడు నన్ను
నంధు మూఢునిఁ గృపఁగావ ♦ నర్హమిాశ!
దీన రక్షక! ననుమించు ♦ దీనుఁ డున్నె?
త్రిజగముల నాకు నినువినా ♦ దిక్కుఁగలదె? 13

దీనులకు ముఖ్య బంధువు ♦ దేవ నీవు
దీను లందేను ముఖ్యుఁడ ♦ దీనికంటె
బాంధవమ్మున్నె గాన నీ ♦ బంధు సరణిఁ
దప్పకుండంగఁ గాచికోఁ ♦ దగును నీకు
నెల్ల నానేరముల క్షమి ♦ యించి నాథ! 14

కేవల ముపేక్ష చేసి యు ♦ న్నావు కాని
శంకరా! నిన్ను నెంచనా ♦ టంకమైన
చెడుదు రాశను విధిలిపిఁ ♦ జెఱుప లేవె?
చెఱుప లేవేని యా బ్రహ్మ ♦ శిరము నెట్లు
మీఁటఁ జాలితి వవలీల ♦ గోటిచేత? 15

విరించి ర్దీర్ఘాయు ర్భవతు భవతా తత్పరశిర
శ్చతుష్కం సంరక్ష్యం స ఖలు భువి దైన్యం లిఖితవాన్,
విచారః కో వా మాం విశదకృపయా పాతి శివ తే
కటాక్షవ్యాపార స్స్వయ మపి చ దీనావనపరః 16.

ఫలాద్వా పుణ్యానాం మయి కరుణయా వా త్వయి విభో
ప్రసన్నేఽపి స్వామిన్ భవదమల పాదాబ్జయుగళమ్,
కథం పశ్యేయం మాం స్థగయతి నమస్సంభ్రమజుషాం
నిలింపానాం శ్రేణి ర్నిజకనకమాణిక్యమకుటైః. 17.

త్వ మేకో లోకానాం పరమఫలదో దివ్యపదవీం
మహాంత స్త్వన్మూలాం పున రపి భజంతే హరిముఖాః,
కియ ద్వా దాక్షిణ్యం తవ శివ మదాశా చ కియతీ
కదా వా మద్రక్షాం వహసి కరుణాపూరితదృశా. 18.

దురాశాభూయిష్ఠే దురధిపగృహద్వారఘటకే
దురంతే సంసారే దురితనిలయే దుఃఖజనకే,
మదాయాసం కిం న వ్యపనయసి క స్యోపకృతయే
వదేయం ప్రీతి శ్చే త్తవ శివ కృతార్థాః ఖలు వయమ్. 19.

వానుదుట దీన భావము౯ ♦ వ్రాసినట్టి
బ్రహ్మ దీర్ఘాయువగుఁ గాక ♦ వాని వాల్గ
తలలు రక్షింపఁ బడుఁగాక ♦ దాన నేమి?
దీనరక్షక! నీకృపా ♦ దృష్టి నన్నుఁ
జేరి రక్షింప నాకు వి ♦ చారమేల? 16.

పూర్ణమా నీను కృపనో నా ♦ పుణ్యమునను
యుభవ! నీవు ప్రసన్నుఁడ ♦ వైనఁ గూడ
నెరగు నందడి నుంజెడి ♦ సురల గముల
కనక రత్న కిరీటముల్ ♦ గప్పఁ గానఁ
గాంతు నెట్లులు నీపాద ♦ కమల యుగము? 17.

నీవె మోక్ష ప్రదాతవు ♦ నిన్నుఁ గొల్చి
హరి ముఖులు దివ్య పదవుల ♦ నందికూడ
పరలఁ గొల్తురు నీకెంత ♦ కరుణ గలదో?
యుభవ! శంకర! నాయాశ ♦ యనఁగ నెంతో?
కాంచినను బూర్ణకృపను ర ♦ క్షింపు మెపుడో? 18.

నిఖిల దుఃఖ దురాశల ♦ నిలయ మగుచుఁ
జెడ్డ ప్రభువుల దరిఁజేర్చి ♦ చేటుఁ దెచ్చు
దుష్ట సంసారమును మాకుఁ ♦ దొలఁగ నీక
విధికి నుపకృతి సేయు నీ ♦ విమల కరుణ
యుభవ! నీయదె మమును గృ ♦ తార్థులుగను. 19

సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నట త్యాశాశాఖా స్వటతి ఝుడితి స్స్వైర మభితః,
కపాలిన్ భిక్షో మే హృదయకపి మత్యంతచపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ భవదధీనం కురు విభో. 20.

ధృతి స్తంభాధారాం దృఢగుణనిబద్ధాం సగమనాం
విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివససన్మార్గఘటితామ్,
స్మరారే మచ్చేత స్స్ఫుటపటకుటీం ప్రాప్య విశదాం
జయ స్వామిన్ శక్త్యా సహ శివగణై స్సేవిత విభో. 21.

ప్రలోభాద్యై రర్థాహరణపరతంత్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్త స్సన్ భ్రమతి బహుధా తస్కరపతే,
ఇమం చేతశ్చోరం కథ మిహ సహే శంకర విభో
తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపామ్.22.

కరోమి త్వత్పూజాం సపది సుఖదో మే భవ విభో
విధిత్వం విష్ణుత్వం దిశసి ఖలు తస్యాః ఫల మితి,
పునశ్చ త్వాం ద్రష్టుం దివి భువి వహన్ పక్షిమృగతా
మదృష్ట్వా తత్ఖేదం కథ మిహ సహే శంకరవిభో. 23

తిరుగు మోహాటవింబడి ♦ తీఁగె బోండ్ల
కుచ గిరుల వాడు కోర్కులన్ ♦ కొమ్మలందు
స్వేచ్ఛఁ జెరలాడు నామతి ♦ చెడ్డ కోఁతి
భక్తి చేఁ గట్టి స్వాధీన ♦ పఱచి కొనుము
పునుక దాలుప! భిక్షుకా! ♦ భువన జనక! 20.

ధైర్యమున్ గుంజ గుణములన్ ♦ త్రాళ్లు గలిగి
నిత్య సంచార యోగ్యమై ♦ నిర్మల మయి
సత్పథమ్మున నుండు నా ♦ స్వాంత మనెడు
చిత్ర పద్మాఢ్య పటకుటిన్ ♦ జెలఁగు మభవ!
ప్రమథ గణములు గొల్వ భ ♦ వానితోడ. 21.

ధనమును హరింప లోభావ ♦ ధనికు లిండ్లఁ
జొరఁగఁ దిరుగును జిత్తమన్ ♦ చోరుఁ డెపుడు
వీని కెట్లోర్తు శంకరా! ♦ వీని లొంచి
నిరప రాధుఁడ నాపయిఁ ♦ గరుణఁ జూపు
భక్తమానస తస్కరా! ♦ భవ భయ హర! 22.

శంకరా! కొల్తు ముక్తి తత్ ♦ క్షణమె యిమ్ము
బ్రహ్మ విష్ణు పదమ్ములఁ ♦ బడయ నీకు
దివి భువిని నిన్నుఁ జూడఁగా ♦ దివిరి మరలఁ
బక్షి పశురూపముల నేను ♦ బడసి నిన్ను
నీశ! గనరాని చింత స ♦ హింపలేను. 23.

కదా వా కైలాసే కనకమణిసౌధే సహ గణై
ర్వసన్ శంభో రగ్రే స్ఫుటఘటితమూర్ధాంజలిపుటః,
విభో సాంబ స్వామిన్ పరమశివ పాహీతి నిగదన్
విధాతౄణాం కల్పాన్ క్షణ మివ వినేష్యామి సుఖతః 24

స్తవై ర్బ్రహ్మాదీనాం జయజయవచోభి ర్నియమినాం
గణానాం కేళీభి ర్మదకలమహోక్షస్య కకుది,
స్థితం నీలగ్రీవం త్రిణయన ముమాశ్లిష్టవపుషం
కదా త్వాం పశ్యేయం కరధృతమృగం ఖండపరశుమ్. 25

కదా వా త్వాం దృష్ట్వా గిరిశ తవ భవ్యాంఘ్రియుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్,
సమాశ్లిష్యాఘ్రాయ స్ఫుటజలజగంధాన్ పరిమళా
నలభ్యం బ్రహ్మాద్యై ర్ముద మనుభవిష్యామి హృదయే 26

కరస్థే హేమాద్రౌ గిరిశ నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజామరసురభిచింతామణిగణే,
శిరస్థే శీతాంశౌ చరణయుగళస్థేఽఖిలశుభే
క మర్థం దాస్యేఽహం భవతు భవదర్థం మమ మనః 27

వెండి కొండను గాంచన ♦ విమల రత్న
సౌధమున నీదు నెదుట నం ♦ జలి ఘటించి
సాంబ! శివ! శివ! శంకరా! ♦ స్వామి! నన్నుఁ
గావవే దేవ! యని బ్రహ్మ ♦ కల్పములను
క్షణములుగ నేను హాయిగాఁ ♦ గడుపు టెపుడొ? 24.

అజముఖులు సంస్తుతింప మ ♦ హర్షి వరులు
జయరవము సేయ గణము లా ♦ స్యములు సలుప
మద వృషము మీఁద గౌరితోఁ ♦ బొదలు చుండి
కరమున మృగమ్ము పరశువుఁ ♦ గ్రాలు నిన్ను
గరళకంఠ! త్రినేత్ర! నేఁ ♦ గాంచు టెపుడొ? 25.

భవ! నినుం గాంచి నీపదా ♦ బ్జములఁ బట్టి
తలను గన్నుల నురమునఁ ♦ దాల్చి తాల్చి
సారసారస గంధముల్ ♦ మూరు కొనుచు
బ్రహ్మ మొదలగు వారలు ♦ పడయఁగాని
హృదయ మోదమ్ముచే నేను ♦ బొదలు టెపుడొ? 26.

చేత మేరువు ధనపతి ♦ చెంత నుండఁ
గామధేనువు సురమణి ♦ కల్పతరువు
సదన మందుండ శిరమునఁ ♦ జంద్రుఁ డుండ
సర్వ శుభములు నీపదా ♦ బ్జముల నుండ
నేమి నీకిత్తుఁ జిత్త మ ♦ ర్పింతు నభవ! 27.

సారూప్యం తవ పూజనే శివ మహాదేవేతి సంకీర్తనే
సామీప్యం శివభక్తిధుర్యజనతాసాంగత్యసంభాషణే,
సాలోక్యం చ చరాచరాత్మకతనుధ్యానే భవానీపతే
సాయుజ్యంమమసిద్ధమత్రభవతిస్వామిన్కృతార్థోఽస్మ్యహమ్.

తత్పాదాంబుజ మర్చయామి పరమం త్వాం చింతయా మ్యన్వహం। త్వా మీశం శరణం వ్రజామి వచసా త్వా మేవ యాచే విభో। వీక్షాం మే దిశ చాక్షుషీం సకరుణాం దివ్యై శ్చిరం ప్రార్థితాం। శంభో లోకగురో మదీయమనస స్సౌఖ్యోపదేశం కురు. 29.

వస్త్రోద్ధూతవిధౌ సహస్రకరతా పుష్పార్చనే విష్ణుతా
గంధే గంధవహాత్మతాన్నపచనే బర్హిర్ముఖాధ్యక్షతా,
పాత్రేకాంచనగర్భ తాస్తి మయి చే ద్బాలేందుచూడామణే
శుశ్రూషాంకరవాణి తే పశుపతే స్వామిన్ త్రిలోకీగురో.

నాలం వా పరమోపకారక మిదం త్వేకం పశూనాం పతే
పశ్యన్కుక్షిగతాంశ్చరాచరగణాన్ బాహ్యస్థితాన్రక్షితుమ్,
సర్వామర్త్యపలాయనౌషధ మతిజ్వాలాకరం భీకరం
నిక్షిప్తం గరళం గళేన గిళితం నోద్గీర్ణ మేవ త్వయా. 31.

అభవ! నినుఁ గొల్చి సారూప్య ♦ మనుభవింతు
హర! నినుం బాడి సామీప్య ♦ మనుభవింతు
నాప్త సద్గోష్ఠి సాలోక్య ♦ మనుభవింతు
ధ్యానమున సాంబ! సాయుజ్య ♦ మనుభవింతు
నన్ని నిటుఁగాంచి దేవ! ధ ♦ న్యాత్ముఁ డగుదు. 28

నీపదాబ్జములనె కొల్తు ♦ నిన్నె తలఁతు
నీశరణఁజొత్తు యాచింతు ♦ నిన్నె సతము
దేవతలు వేఁడు నీకృపా ♦ దృష్టిచేత
దేవ! ననుఁగాంచి సౌఖ్యోప ♦ దేశమిమ్ము
ముజ్జగమ్ముల గురువయి ♦ పొలుచు నభవ! 29.

ఉడుపులిడ వేయికరముల ♦ ద్యుమణి నగుచు
హావిసు విరులిడ జిష్ణు వి ♦ ష్ణువులు నగుచు
గంధమిడ గంధవహుఁడగు ♦ గాలినగుచుఁ
బాత్రనిడ స్వర్ణగర్భుఁడౌ ♦ బ్రహ్మనైనఁ
జంద్రశేఖర! నీపూజ ♦ సలుప నేర్తు. 30

ఉదరమందును వెలుపల ♦ నున్నయట్టి
ప్రాణిచయముల రక్షించు ♦ పనికి నభవ!
గ్రక్కకయు మ్రింగకుండ నీ ♦ కంఠమందు
గరళమును దాల్చి వేల్పులఁ ♦ గాచినట్టి
యాకరుణ చాలదే నిన్ను ♦ నెఱుకపఱుప? 31

జ్వాలోగ్ర స్సకలామరాతిభయదః క్ష్వేళః కథం వాత్వయా
దృష్టః కించ కరే ధృతః కరతలే కిం పక్వజంబూఫలమ్,
జిహ్వాయాం నిహితశ్చ సిద్ధఘుటికా వా కంఠదేశే భృతః
కిం తే నీలమణి ర్విభూషణమయం శంభో మహాత్మన్వద 32.

నాలం వా సకృ దేవ దేవ భవత స్సేవా నతి ర్వా నుతిః
పూజా వా స్మరణం కథా శ్రవణమప్యాలోకనం మాదృశామ్,
స్వామి న్నస్థిరదేవతానుసరణాయాసేన కిం లభ్యతే
కా వా ముక్తిరితః కుతో భవతి చేత్కిం ప్రార్థనీయం తదా.

కిం బ్రూమ స్తవ సాహసం పశుపతే కస్యాస్తి శంభో భవ
ద్ధైర్యం చేదృశమాత్మనస్థితిరియంచాన్యైః కథంలభ్యతే,
భ్రశ్య ద్దేవగణం త్రస న్మునిగణం నశ్య త్ప్రపంచం లయం
పశ్యన్నిర్భయ ఏక ఏవ విహరత్యానందసాంద్రో భవాన్.

యోగక్షేమధురంధరస్య సకల శ్రేయః ప్రదోద్యోగినో
దృష్టాదృష్టమతోపదేశకృతినో బాహ్యాంతరవ్యాపినః,
సర్వజ్ఞస్య దయాకరస్య భవతః కిం వేదితవ్యం మయా
శంభోత్వంపరమాంతరంగ ఇతి మే చిత్తేస్మరామ్యన్వహమ్.

వేల్పులకు భీతిఁ గొల్పెడు ♦ విషముఁ గాంచి
చేఁగొని మహాత్మ! నీవది ♦ చేతి యందుఁ
బ్రీతి నిడుకొంటివేమి నే ♦ రేడు పండ?
జిహ్వఁ దాల్చితి వదినీకు ♦ సిద్ధ ఘుటిక?
నీయఱుత నుంచికొంటివి ♦ నీలమణియ? 32

శంకరా! భక్తితో నొక్క ♦ సారమైన
నిను మ్రొక్కినఁ బొగడిన ♦ నిన్ను వినిన
నిన్నుఁ దలఁచినఁ గొలిచిన ♦ నిన్నుఁ గనిన
నబ్బుచుండంగ ముక్తి యీ ♦ యస్థిరంపు
వేలుపుల వ్యర్థముగఁ గొల్వ ♦ నేల మాకు? 33

వెఱచి పరుగిడ దేవతల్ ♦ బెదర మునులు
ప్రళయమందుచు నుండఁ బ్ర ♦ పంచ మెల్ల
నంతఁ దిరుగుచునుందు వా ♦ నందముగను
నిర్భయమ్ముగ శంకరా! ♦ నీవొకఁడవె
యిట్టి సాహస ధైర్యమ్ము ♦ లెవరికబ్బు? 34

నీవె శంకర! యోగముల్ ♦ క్షేమములని
వెలిని లోనిండి సర్వముల్ ♦ దెలియు చుండి
యిహపరమ్ముల విషయమ్ము ♦ లెల్లఁ జూపి
నిఖిల శుభముల నిడుకృపా ♦ నిధివి గాన
నిన్ను సతతమ్ము పరమాప్తు ♦ నిగఁ దలంతు 35.

భక్తో భక్తిగుణావృతే ముదమృతాపూర్ణే ప్రసన్నే మనః
కుంభే సాంబ తవాంఘ్రిపల్లవయుగం సంస్థాప్య సంవిత్ఫలమ్
సత్త్వం మంత్ర ముదీరయన్ నిజశరీరాగారశుద్ధిం వహన్
పుణ్యాహం ప్రకటీకరోమి రుచిరం కల్యాణ మాపాదయన్

ఆమ్నాయాంబుధి మాదరేణ సుమనస్సంఘాః సముద్యన్మనో
మంథానం దృఢభక్తిరజ్జుసహితం కృత్వా మథిత్వా తతః,
సోమం కల్పతరుం సుపర్వసురభిం చింతామణిం ధీమతాం
నిత్యానందసుధాం నిరంతరరమాసౌభాగ్య మాతన్వతే 37

ప్రాక్పుణ్యాచలమార్గదర్శితసుధామూర్తిః ప్రసన్న శ్శివ
స్సోమ స్సద్గణసేవితో మృగధరః పూర్ణ స్తమోమోచకః
చేతః పుష్కరలక్షితో భవతి చే దానందపాథోనిధిః
ప్రాగల్భ్యేన విజృంభతే సుమనసాం వృత్తి స్తదా జాయతే.

ధర్మో మే చతురంఘ్రిక స్సుచరితః పాపం వినాశం గతం
కామక్రోధమదాదయో విగళితాః కాలాస్సుఖావిష్కృతాః
జ్ఞానానంద మహౌషధి స్సుఫలితా కైవల్యనాథే సదా
మాన్యే మానసపుండరీకనగరే రాజావతంసే స్థితే. 39.

శుభమునకు దేహగేహముఁ • శుభ్రపఱచి
భక్తుఁడను నీదు పదపల్ల • వముల మీఁద
భక్తిగుణావృత హర్షసం • భరిత విమల
జ్ఞాన ఫలయుక్త హృత్కల • శంబునుంచి
యాచరింతు సమంత్ర పు • ణ్యాహము భవ! 36.

గాఢ భక్తిని సుమనసుల్ • త్రాడు చేసి
స్వాంతమను కవ్వమున వేద • జలధిఁ ద్రచ్చి
పడయుదురు నిన్ను • భక్తుల పాలికెన్న
సురతరువు శాశ్వతానంద • సుధయు సురభి
సుర మణియు మోక్షభాగ్యముఁ • సోము సభవ! 37.

శివుఁడు మృగధారి సద్గుణ • సేవితుండు
పూర్ణ సోముండు శుచియుఁ ద • మోవిదారి
యమృతమయమూర్తి పూర్వ పు • ణ్యాద్రి వెడలి
వెలుఁగ హృద్దివి నానంద • జలధిపొంగు
సుమనసుల చిత్తవృత్తుల • తమి చెలంగు. 38

నా మనః పద్మమనియొడి • నగరమందు
మోక్షపతి రాజశేఖర • పూజ్యుఁడేల
నాల్గుపాదాల ధర్మంబు • నడవఁ జొచ్చె
జ్ఞానహర్షౌషధుల పండెఁ • జనెన ఘూళి
హాయిగాఁ గాలమేగెఁ గా • మాదులడఁగె. 39

ధీయంత్రేణ వచోఘటేన కవితాకుల్యోపకుల్యాక్రమై
రానీతైశ్చ సదాశివస్య చరితాంభోరాశిదివ్యామృతైః,
హృత్కేదారయుతా శ్చ భక్తికలమా స్సాఫల్యమాతన్వతే
దుర్భిక్షా న్మమ సేవకస్య భగవన్విశ్వేశ భీతిః కుతః 40

పాపోత్పాతవిమోచనాయరుచిరైశ్వర్యాయ మృత్యుంజయ
స్తోత్రధ్యాననతి ప్రదక్షిణసపర్యాలోకనాకర్ణనే,
జిహ్వాచిత్తశిరోంఘ్రిహస్తనయన శ్రోత్రైరహం ప్రార్థితో
మామాజ్ఞాపయ తన్నిరూపయముహుర్మామేవమా మేఽవచః

గాంభీర్యం పరిఖాపదం ఘనధృతిః ప్రాకార ఉద్యద్గుణ
స్తోమశ్చాప్తబలం ఘనేంద్రియచయో ద్వారాణి దేహస్థితః
విద్యా వస్తుసమృద్ధి రిత్యఖిలసామగ్రీసమేతే సదా
దుర్గాతిప్రియ దేవ మామకమనోదుర్గే నివాసం కురు 42

మా గచ్ఛస్త్వమిత స్తతో గిరిశ భో మయ్యేవ వాసం కురు
స్వామి న్నాదికిరాత మామకమనః కాంతారసీమాంతరే
వర్తంతే బహుశో మృగా మదజుషో మాత్సర్యమోహాదయ
స్తాన్హత్వా మృగయావినోదరుచితాలాభం చ సంప్రాప్స్యసి.

సాంబ! నీచరితామృత ♦ జలధి నుండి
బుద్ధి యంత్రమ్ముచేత సం ♦ బద్ధమైన
వాగ్ఘటంబునఁ గైతకా ♦ ల్వలను బఱపి
స్వాంతమను చేనికిం బెట్టి ♦ భక్తియు నెడు
వరిని బండింతు దుర్భిక్ష ♦ భయమికేల? 40.

పాపములఁ బాసి సిరులను ♦ బడయ నెంచి
వాక్కు వినుతికి మనసు ధ్యా ♦ నమ్ముసలుప
శిరము నతికంఘ్రులు ప్రద ♦ క్షిణపు విధికి
వినఁజెవులు గొల్వఁగరములు ♦ గనఁగఁగన్ను
లొగ్గఁగొను సేవ నెడతెగ ♦ కుండ నభవ! 41.

పరిఖ గంభీరగుణము స ♦ ద్వప్రమెన్న
ధైర్య ముత్తమ గుణములు ♦ తగుబలములు
ద్వారతతి యింద్రియాళి వి ♦ త్తమ్ము విద్య
గాంచి యిట్లెల్ల సామగ్రి ♦ మించునాదు
స్వాంత దుర్గాన దుర్గాధి ♦ పావసింపు. 42.

ఏల యిటునటుఁ దిరుగ గి ♦ రీశ నీకు
నామనంబను కాంతార ♦ సీమయందు
మసలుచుండెడి క్రొవ్విన ♦ మత్సరాది
వివిధ మృగముల నీవేఁట ♦ వేడ్కదీరఁ
జంపు మాదికిరాత! మో ♦ క్షప్రదాత! 43.

కరలగ్నమృగః కరీంద్రభంగో
ఘనశార్దూలవిఖండనోఽస్తజంతుః,
గిరిశో విశదాకృతిశ్చ చేతః
కుహరే పంచముఖోఽస్తి మే కుతో భీః. 44

ఛందశ్శాఖిశిఖాన్వితై ర్ద్విజవరై స్సంసేవితే శాశ్వతే
సౌఖ్యాపాదిని ఖేదభేదిని సుధాసారైః ఫలై ర్దీపితే,
చేతః పక్షిశిఖామణే త్యజ వృథా సంచార మన్యై రలం
నిత్యం శంకర పాదపద్మయుగళీనీడే విహారం కురు. 45

ఆకీర్ణే నఖరాజికాంతివిభవై రుద్యత్సుధావైభవై
రాధౌతేఽపి చ పద్మరాగలలితే హంసవ్రజై రాశ్రితే
నిత్యం భక్తివధూగణైశ్చ రహసి స్వేచ్ఛావిహారం కురు
స్థిత్వా మానసరాజహంస గిరిజా నాథాంఘ్రిసౌధాంతరే.

శంభుధ్యానవసంతసంగిని హృదారామేఽఘజీర్ణచ్ఛదా
స్స్రస్తా భక్తిలతాచ్ఛటావిలసితాః పుణ్యప్రవాళశ్రితాః,
దీప్యంతే గుణకోరకా జపవచఃపుష్పాణి సద్వాసనా
జ్ఞానానందసుధామరందలహరీ సంవిత్ఫలాభ్యున్నతిః. 47

చేత మృగముండి కడుపున ◆ జీవులుండి
కరివరుని భంగపఱచి వ్యా ◆ ఘ్రమును ద్రుంచి
యద్రి యందుండి తెల్లని ◆ యంగముండి
చెలఁగు నొక పంచముఖము నా ◆ చిత్తగుహను
వాస మొనరించె నింకేల ◆ భయము నాకు? 44.

వేద భూరుహ శాఖాంత ◆ విహితమైన
శాశ్వతానంద రసఫల ◆ సహితమైన
సౌఖ్య నిక్షేప సద్ద్విజా ◆ శ్రయము నైన
హరపదాంబుజ మను గూఁటి ◆ యందు నిలుము
మానస ఖగేంద్ర! యన్యమ్ము ◆ మానుమింక. 45.

ప్రకట నఖరాజి కాంతివి ◆ రాజితమ్ము
వరసుధాకర ధౌతమ్ము ◆ పద్మరాగ
భాసితము హంససేవా వి ◆ కాసితమ్ము
నైన శంకరపాద సౌ ◆ధాంతరమునఁ
జెలఁగు భక్త్యంగనాసక్త ◆ చిత్తహంస. 46.

శంకర ధ్యానమనెడు వ ◆ సంత మొదవ
స్వాంతవనిఁ బాప జీర్ణప ◆ ర్ణాలిరాలు
పుణ్యము చిగిర్చు సుగుణముల్ ◆ మొగ్గదొడుగు
జపము పుష్పించు హర్ష ర ◆ సమ్ము పాఱు
భక్తిలతమించు జ్ఞాన సం ◆ పద ఫలించు. 47.

నిత్యానందరసాలయం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛం సద్ద్విజసేవితం కలుషహృత్సద్వాసనావిష్కృతమ్,
శంభుధ్యానసరోవరం వ్రజ మనోహంసావతంస స్థిరం
కిం క్షుద్రాశ్రయపల్వలభ్రమణసంజాతశ్రమం ప్రాప్స్యసి. 48

ఆనందామృతపూరితా హరపదాంభోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్నముపేత్య భక్తిలతికా శాఖోపశాఖాన్వితా,
ఉచ్చైర్మానసకాయమానపటలీమాక్రమ్య నిష్కల్మషా
నిత్యాభీష్టఫలప్రదా భవతు మే సత్కర్మసంవర్ధితా. 49

సంధ్యారంభవిజృంభితం శ్రుతిశిరస్స్థానాంతరాధిష్ఠితం
సప్రేమభ్రమరాభిరామమసకృత్సద్వాసనాశోభితమ్,
భోగీంద్రాభరణం సమస్తసుమనఃపూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరిమల్లికార్జునమహాలింగం శివాలింగితమ్. 50

భృంగీచ్ఛానటనోత్కటః కరిమదగ్రాహీ స్ఫురన్మాధవా
హ్లాదో నాదయుతో మహాసితవపుః పంచేషుణా చాదృతః
సత్పక్షః సుమనోవనేషు సపున స్సాక్షాన్మదీయే మనో
రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీ విభుః. 51

శంకర ధ్యాన విమల కా ♦ సార మెన్న
నమర సద్ద్విజ హృత్కమ ♦ లాశ్రయమ్ము
వివిధ పుణ్య సువాసనా ♦ విష్కృతమ్ము
శాశ్వతానంద పూరమ్ము ♦ స్వాంత హంస!
పరఁగు మిటఁ బాడు పడియల ♦ బడల నేల? 48.

హరపదాంబుజ మను పాదు ♦ నందుఁ బుట్టి
ప్రవిమ లానంద సలిల పూ ♦ రమునఁ బెరిగి
స్థైర్యమునఁ బ్రాకి శాఖోప ♦ శాఖలుగను
స్వాంతమనియెడి పందిరి ♦ నలము కొన్న
భక్తిలత పుణ్య శాశ్వత ♦ ఫలము నిడుత. 49

సంజ నలరుచు శ్రుతిపయి ♦ స్థానమంది
శ్రీగిరి భ్రమరాప్తమున్ ♦ బ్రేమ మయము
సగుణ సద్వాసితము శివా ♦ స్పదము నగుచు
భోగి భూషణ సుమనః ప్ర ♦ పూజ్య మైన
మల్లికార్జున లింగమున్ ♦ భక్తిఁ గొలుతు. 50

ఇభమదగ్రాహి భృంగి స ♦ న్నృత్య రతుఁడు
నాద సత్పక్షు మాధవా ♦ హ్లాద పరుఁడు
చిత్త భవులక్ష్యమున్ మహా ♦ సితతనుండు
సర్వ సుమనో వనుండు శ్రీ ♦ శైలవాసి
భ్రమరపతి మద్ధృదంబు జ ♦ వాసి యగుత. 51.

కారుణ్యామృతవర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం
విద్యాసస్యఫలోదయాయ సుమన స్సంసేవ్య మిచ్ఛాకృతిమ్,
నృత్యద్భక్తమయూర మద్రినిలయం చంచజ్జటామండలం
శంభో వాంఛతి నీలకంధర సదా త్వాం మే మనశ్చాతకః 52

ఆకాశేన శిఖీ సమస్తఫణినాం నేత్రా కలాపీనతా
నుగ్రాహిప్రణవోపదేశనినదైః కేకీతి యో గీయతే,
శ్యామాం శైలసముద్భవాం ఘనరుచిం దృష్ట్వానటంతంముదా
వేదాంతోపవనే విహారరసికం తం నీలకంఠం భజే. 53.

సంధ్యాఘర్మదినాత్యయో హరికరాఘాతప్రభూతానక
ధ్వానోవారిదగర్జితం దివిషదాం దృష్టిచ్ఛటాచంచలా,
భక్తానాం పరితోషబాష్పవితతి ర్వృష్టిర్మయూరీ శివా
యస్మి న్నుజ్జ్వలతాండవం విజయతే తం నీలకంఠం భజే

ఆద్యాయామితతేజసే శ్రుతిపదై ర్వేద్యాయసాధ్యాయ తే
విద్యానందమయాత్మనే త్రిజగత స్సంరక్షణోద్యోగినే,
ధ్యేయాయాఖిలయోగిభి స్సురగణై ర్గేయాయమాయావినే
సమ్యక్తాండవసంభ్రమాయ జటినే సేయం నతి శ్శంభవే.

కృపను వర్షింప ఘనవిప • ద్గ్రీష్మ మడఁప
జ్ఞానము ఫలింప సుమనసుల్ • సంశ్రయింప
నలరి శ్రితకేకులు నటింప • నద్రిఁ దోఁచు
నవనవాకార! నిలకంధర! • జటాల!
ప్రీతి నినుఁగోరు నామన • శ్చాతకమ్ము 52.

రమ్య వేదాంత వనచర • ద్రసికుఁ డగుచు
నాకసము చేత శిఖియయి • యలరు చుండి
పాపదోరచేఁ గలాపియై • ప్రణవ బోధ
నలుపు నేర్పిన కేకియై • శ్యామ గిరిజ
ఘనరుచికి నాడు నా నీల • కంఠు గొలుతు. 53.

వారిమృదంగ రవమ్ములే • యుఱుములుగను
మించు దివిజుల చూపులే • మెఱుములు గను
భక్త హర్షాశ్రు పాతమే • వర్షముగను
గౌరియె మయూరి సంజతో • ల్కరిగ నాడు
నామహా నీలకంఠుని • నాత్మఁ దలఁతు. 54.

ఆద్య! శ్రితహృద్య! వేదవే • దాంత వేద్య!
లోకరక్షణరత! సుర • లోక వినుత!
శ్రీచిదానంద! జ్యోతిర్ద్వి • చిత్రకంద!
యోగి హృద్గమ్య! మాయా ప్ర • యోగరమ్య!
యమల మునివేష! వినతి నృ • త్యాభిలాష! 55.

నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయనీశ్రేయసే
సత్యాయాదికుటుంబినే ముని మనఃప్రత్యక్షచిన్మూర్తయే
మాయాసృష్టజగత్త్రయాయ సకలామ్నాయాంత సంచారిణే
సాయం తాండవసంభ్రమాయ జటినే సేయంనతిశ్శంభవే. 56

నిత్యం స్వోదరపోషణాయ సకలా నుద్దిశ్య విత్తాశయా
వ్యర్థం పర్యటనం కరోమి భవత స్సేవాం నజానే విభో,
మజ్జన్మాంతరపుణ్యపాకబలత స్త్వంశర్వసర్వాంతర
స్తిష్ఠ స్యేవహి తేనవాపశుపతే తేరక్షణీయోఽస్మ్యహమ్.

ఏకో వారిజబాంధవః క్షితినభో వ్యాప్తం తమోమండలం
భిత్వా లోచనగోచరోపి భవతి త్వం కోటిసూర్యప్రభః,
వేద్యః కిం నభవ స్యహో ఘనతరం కీదృగ్భవే న్మత్తమ
స్తత్సర్వం వ్యపనీయమే పశుపతే సాక్షాత్ప్రసన్నోభవ.

హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోర స్తథా,
చేతో వాంఛతి మామకం పశుపతే చిన్మార్గగమ్యం విభో
గౌరీనాథ భవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదమ్ 59

శాంత! త్రిగుణాత్మ! నిత్య! వే ♦ దాంత రమణ!
పురహర! మునీంద్ర హృద్య చి ♦ న్మూర్తి విభవ!
సత్య! మాయావినిర్మిత ♦ సర్వలోక!
ప్రథమ సుకుటుంబ! గౌరీత ♦ పః ఫలంబ!
వందనము సాంధ్య నృత్య సం ♦ భ్రమ! మహాత్మ! 56

ఉదర పోషణమునకయి ♦ యొరుల కడకుఁ
బ్రతిదినమ్మును దిరిగితి ♦ వ్యర్థముగను
ఎన్నడును నిన్ను సేవించి ♦ యెఱుఁగ నైతి
నన్నిటను నీవు పశుపతీ ♦ యున్న కతనఁ
బ్రోవు మిఁకనైన నాపూర్వ ♦ పుణ్యఫలము! 57.

భువి దివిని బర్వతమమును ♦ రవి యొకండె
చిన్మ గోచరమగును నే ♦ త్రమ్ములకును
కోటిసూర్య ప్రభలవెల్గు ♦ మేటివీవు
కనఁబడవు నాతమంబెంత ♦ ఘనమొ దీని
నట్టె యెగఁజిమ్మి ప్రత్యక్ష ♦ మగుము దేవ! 58.

చక్రవాకము సూర్యునిఁ ♦ జాతకమ్ము
నీరదమ్మును జంద్రుఁ జ ♦ కోరకమ్ము
సారసాకరమును హంస ♦ గోరునట్లు
జ్ఞానగోచరమయి మోక్ష ♦ సౌఖ్య మిచ్చు
త్వత్పదాంబుజమును గోరు ♦ స్వాంతము భవ! 59.

రోధ స్తోయహృతశ్శ్రమేణ పథిక శ్ఛాయాంతరోర్వృష్టితో
భీత స్స్వస్థగృహం గృహస్థ మతిథి ర్దీనః ప్రభుం ధార్మికమ్,
దీపం సంతమసాకుల శ్చ శిఖినం శీతావృత స్త్వం తథా
చేత స్సర్వభయాపహం వ్రజసుఖం శంభోః పదాంభోరుహమ్

అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధు స్సరిద్వల్లభమ్,
ప్రాప్నోతీవ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే 61.

ఆనందాశ్రుభి రాతనోతి పులకం నైర్మల్యత శ్ఛాదనం
వాచాశఙ్ఖముఖస్థితైశ్చ జఠరాపూర్తిం చరిత్రామృతైః,
రుద్రాక్షై ర్భసితేన దేవ వపుషో రక్షాం భవద్భావనా
పర్యంకే వినివేశ్య భక్తిజననీ భక్తార్భకం రక్షతి. 62.

మార్గావర్తితపాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే,
గండూషాంబునిషేచనం పురరిపో ర్దివ్యాభిషేకాయతే.
కించి ద్భక్షితమాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కిం నకరో త్యహో వనచరో భక్తావతంసాయతే.

వరదఁబడి యొడ్డువడఁబడి ♦ తరువు నీడ
జడిఁబడి గృహమ్ముఁ జలికగ్నిఁ ♦ జెడియుదారు
చీఁకటికి దీపమును గేస్తు ♦ నాఁకటికిని
జేరుగతి శంకరాంఘ్రిఁ ♦ జేరు మనస!
సర్వభయములఁ బోఁగొట్టి ♦ సౌఖ్యమిడును. 60

బీజమం కోలవృక్షముగా ♦ బ్రేమమీఱ
సూది సూదంటు రాతిని ♦ సుసతి పతిని
దీఁగె తరువును సింధువు ♦ సాగరమును
బొందుగతి చిత్తవృత్తి శంభు ♦ ని శుభాంఘ్రి
వనజ యుగమును బొందు నే ♦ భక్తియండ్రు. 61

కడిగి హర్షాశ్రువుల మేను ♦ గగురు గొనఁగ
సుమతిచేఁ గప్పి త్వత్కథా ♦ సుధను ద్రాపి
తనువునకుఁ బెట్టి భస్మరు ♦ ద్రాక్ష రక్ష
యభవ! నీధ్యాన పర్యంక ♦ మందు నునిచి
భక్త శిశువునుగాచు నీ ♦ భక్తి జనని 62

క్షుద్రపాదుక శివునకుఁ ♦ గుంచెయయ్యె
బుక్కిలింతయె యభిషేక ♦ పూరమయ్యె
వెగటు మాంసపు ముక్కనై ♦ వేద్య మయ్యె
వనచరుఁడు బోయ యొకమహా ♦ భక్తుఁడయ్యె
భక్తి శక్తిని దెల్ప నె ♦ వ్వరి తరంబు. 63

వక్ష స్తాడన మంతకస్య కఠినాపస్మారసంమర్దనం
భూభృత్పర్యటనం నమ త్సురశిరః కోటీరసంఘర్షణమ్,
కర్మేదం మృదులస్య తావకపదద్వంద్వస్య గౌరీపతే
మచ్చేతో మణిపాదుకావిహరణం శంభో సదాంగీకురు. 64

వక్ష స్తాడనశంకయా విచలితో వైవస్వతో నిర్జరాః
కోటీరోజ్జ్వలరత్నదీపకలికా నీరాజనం కుర్వతే,
దృష్ట్వా ముక్తివధూ స్తనోతి నిభృతాశ్లేషం భవానీపతే
యచ్చేత స్తవ పాదపద్మభజనం తస్యేహ కిందుర్లభమ్. 65

క్రీడార్థం సృజసి ప్రపంచ మఖిలం క్రీడామృగా స్తే జనాః
యత్కర్మాచరితం మయా చ భవతః ప్రీత్యై భవత్యేవ తత్
శంభో స్వస్య కుతూహలస్య కరణం మచ్చేష్టితః నిశ్చితం
తస్మా న్మామకరక్షణం పశుపతే కర్తవ్య మేవ త్వయా. 66

బహువిధపరితోషబాష్పపూర
స్ఫుటపులకాంకితచారుభోగభూమిమ్,
చిరపదఫలకాంక్షిసేవ్యమానాం
పరమసదాశివభావనాం ప్రపద్యే. 67

దండధరు యము వక్షమ్ముఁ ◆ దన్నుచుండి
విడువ కెప్పుడు కొండను ◆ నడచుచుండి
సురమణీ కిరీట కోటుల ◆ నొరయుచుండి
పాపముల మీటు నీమృదు ◆ పాదమునకుఁ
దొడుగు మచ్చిత్త రత్న పా ◆ దుకను నభవ! 64.

భవ! భవత్పాద సరసిజ ◆ భక్తుఁ గాంచి
పాఱు నెదదన్నులకు భయం ◆ పడి యముండు
వేల్పులు కిరీటకాంతి దీ ◆ పికల చేత
నిత్తురు నివాళి వడిఁ గౌఁగి ◆ లించు ముక్తి
యభవ! నీభక్తమణికి దు ◆ ర్లభము కలదె? 65.

పశుపతీ! నీదు లీల ప్ర ◆ పంచ మెల్ల
ఆట పసులము మేమెల్ల ◆ నభవ! నీకు
వెలయు మాచేష్టలెల్ల నీ ◆ ప్రీతి కొఱకె
త్వత్కుతూహలమును దీర్చు ◆ పసుల మమ్ము
నెమ్మి రక్షించు భారమ్ము ◆ నీదెసుమ్ము. 66.

అమల తరభక్తి చిహ్నమ్ము ◆ లై తనర్చు
పులకలకు మఱి హర్షాశ్రు ◆ పూరములకు
భోగ ధామమ్ముగా నుండి ◆ మోక్షపదవిఁ
గోరువారలు సేవించు ◆ సారమైన
శంకర ధ్యానమేనాకు ◆ సంశ్రయంబు. 67

అమితముదమృతం ముహుర్దుహంతీం
    విమలభవత్పదగోష్ఠ మావసంతీమ్.
సదయ పశుపతే సుపుణ్యపాకాం
    మమ పరిపాలయ భక్తిధేను మేకామ్ 68

జడతా పశుతా కళంకితా
    కుటిలచరత్వం చ నాస్తి మయి దేవ
అస్తి యది రాజమౌళే
    భవ దాభరణస్య నాస్తి కిం పాత్రమ్. 69

అరహసి రహసి స్వతంత్రబుద్ధ్యా
    పరివసితుం సులభః ప్రసన్నమూర్తిః,
అగణితఫలదాయకః ప్రభు ర్మే
    జగదధికో హృది రాజశేఖరోఽస్తి. 70

ఆరూఢభక్తిగుణకుంచితభావచాప
    యుక్తై శ్శివస్మరణబాణగణై రమోఘైః,
నిర్జిత్యకిల్బిషరిపూ న్విజయీసుధీంద్ర
    స్సానంద మావహతి సుస్థిరరాజలక్ష్మీమ్. 71

హర! భవత్పాద గోష్ఠము౦ ♦ దలరుచుండి
తప్పు కెప్పుడు హర్షామృ ♦ తమును బిదికి
విమలపుణ్య ఫలంబయి ♦ వెలయుచుండు
నొక్క నాభక్తి ధేనువు౦ ♦ జక్కగాను
గావవలయును బశుపతీ! ♦ కరుణఁ దలఁచి. 68

లేదు నాయందు జడతయు ♦ లేదు పశుత
లేదు నాలో కళంకము౯ ♦ లేదు వంక
యుండినను జంద్రుఁడో దల ♦ నుష్ణ నీకు
మండనంబుగ నుండ న ♦ ర్హుండుగాన?
దెల్పుమో శివ! శంకరా! ♦ దేవదేవ! 69

వెలిని లోపల స్వేచ్ఛగాఁ ♦ గొలుచు టకును
సులభుఁ డగుచుఁ బ్రసన్నుఁడై ♦ యలరువాఁడు
అగణిత ఫలప్రదాతయై ♦ నెగడు వాఁడు
సృష్టికర్తయు నధిపుఁడై ♦ యొసఁగు వాఁడు
చెలఁగు మత్స్వాంతమున రాజ ♦ శేఖరుండు. 70

భక్తియను దృఢగుణముచే ♦ భావమనెడు
చాపమును వంచి శంకర ♦ స్మరణ మనెడు
బాణజాలమ్ముఁ బఱపి పా ♦ పమ్ము లనెడు
శత్రువుల నోర్చి విజయ హ ♦ ర్షములఁ బేర్చి
మించు స్థిరరాజ్యరమను గ్ర ♦ హించు సుమతి. 71.

ధ్యానాంజనేన సమవేక్ష్య తమః ప్రదేశం
భిత్త్వా మహాబలిభి రీశ్వరనామమంత్రైః,
దివ్యాశ్రితం భుజగభూషణ ముద్వహంతి
యే పాదపద్మ మిహ తే శివ తే కృతార్థాః. 72

భూదారతా ముదవహ ద్యద పేక్షయా శ్రీ
భూదార ఏవ కి మత స్సుమతే లభస్వ,
కేదార మాకలితముక్తిమహౌషధీనాం
పాదారవిందభజనం పరమేశ్వరస్య. 73

ఆశాపాశక్లేశ దుర్వాసనాది
భేదోద్యుక్తై ర్దివ్యగంధై రమందైః,
ఆశాశాటీకస్య పాదారవిందం
చేతఃపేటీం వాసితాం మే తనోతు. 74

కల్యాణినం సరసచిత్రగతిం సవేగం
సర్వేంగితజ్ఞ మనఘం ధ్రువలక్షణాఢ్యమ్,
చేతస్తురంగ మధిరుహ్య చర స్మరారే
నేత స్సమస్తజగతాం వృషభాధిరూఢ. 75.

శంకరామల పాదపు * ష్కరమునందుఁ
గ్రమ్మి వరభక్తి యనెడు మే * ఘమ్ము గురియు
నిరుప మానంద వృష్టిచే * నిండు నెవని
స్వాంతపుష్కర మాతని * జన్మ సస్య
మంతయు ఫలించు విఫల మ * న్యమ్ము సుమ్ము. 76

శంకరా! నీపదాంబుజ ♦ సక్త యగుట
విరహావతి సాధ్వీకరణి నా ♦ విమలబుద్ధి
సతము నినునెంచు శివమంత్ర ♦ జపము చేత
స్థిరతఁ గాంచంగ మోహిత ♦ స్త్రీవలె నినుఁ
దలఁప దర్శింపఁ గీర్తింపఁ ♦ దమక పడును. 77

ఆశ్రయించెడు విధమును ♦ నణఁకువ యును
మంచి మనసును నిన్ను సే ♦ వించు నేర్పు
కలిగి యున్నది నాబుద్ధి ♦ కరుణదీని
నెల్ల సద్గుణములును వ ♦ ర్ధిల్లునట్టు
లేలుకొను మీశ! క్రొత్త యి ♦ ల్లాలిఁ బోలె. 78

అమల యోగీంద్ర మానస ♦ కమలదళము
లందుఁ జరియించు నతికోమ ♦ లాంఘ్రి చేతఁ
గఠిన తరమైన యముని వ ♦ క్షఃకవాట
మెట్లు దన్నితి వీశ! చిం ♦ తిల్లు మనసు
ప్రీతి నెత్తెదఁ జూపుమా ♦ మృదుపదమ్ము. 79

ఏష్య త్యేష జనిం మనోఽస్య కఠినం తస్మి న్నటా నీతి మ
ద్రక్షాయై గిరిసీమ్ని కోమలపదన్యాసః పురాభ్యాసితః,
నోచే ద్దివ్యగృహాంతరేషు సుమనస్తల్పేషు వేద్యాదిషు
ప్రాయ స్సత్సు శిలాతలేషు నటనం శంభో కిమర్థం తవ. 80

కంచిత్కాల ముమామహేశ భవతః పాదారవిందార్చనైః
కంచిధ్యానసమాధిభి శ్చ నతిభిః కంచి త్కథాకర్ణనైః,
కంచి త్కంచి దవేక్షణై శ్చ నుతిభిః కంచి ద్దశా మీదృశీం
యః ప్రాప్నోతి ముదా త్వదర్పితమనా జీవన్ స ముక్తః ఖలు

బాణత్వం వృషభత్వ మర్ధవపుషా భార్యాత్వ మార్యాపతే?
ఘోణిత్వం సఖితామృదంగవహతా చేత్యాదిరూపం దధౌ
త్వత్పాదే నయనార్పణం చ కృతవాన్ త్వద్దేహభాగో హరిః
పూజ్యాత్పూజ్యతర స్సఏవ హి న చేత్కో వా తదన్యోఽధికః

జననమృతియుతానాం సేవయా దేవతానాం
న భవతి సుఖలేశ స్సంశయో నాస్తి తత్ర,
అజని మమృతరూపం సాంబ మీశం భజంతే
య ఇహ పరమసౌఖ్యం తే హి ధన్యా లభంతే. 83

కఠినముగనుండు నామది ♦ గాన నభవ!
యందుఁ దిరుగుట యెట్లని ♦ యద్రిఁ దిరుగ
నేర్చుకొంటివి గాకున్న ♦ నెమ్మి మీఱ
నలరు పాన్పుల మేడల ♦ నరుగు లందుఁ
బరఁగు నీవేడ? యీ శిలా ♦ భ్రమణ మేడ? 80

స్వాంతమిడి కొంత నీపదా ♦ ర్చనము నందుఁ
గొంత యాకర్ణనమ్మునఁ ♦ గొంత నతులఁ
గొంత ధ్యాన సమాధులఁ ♦ గొంత నుతులఁ
గొంత దర్శనమునఁ గాల ♦ మంత నిట్లు
పుచ్చు నాతండె జీవించు ♦ ముక్తుఁ డభవ! 81

నీకు బాణమ్ము వృషభముగ ♦ సూకరమ్ము
సకుఁడు పత్ని మృదంగ వా ♦ హకుఁడు నగుచు
నెన్నియో రూపములఁ గొల్చి ♦ దృష్టినీదు
నంఘ్రిపైనుంచి నీయంశ ♦ మంది యభవ!
పూజ్యతరుఁడయ్యె హరిమించు ♦ పుణ్యుఁడున్నె? 82

జననమును మఱి మృతియును ♦ గనెడునట్టి
క్షుద్ర దేవతలను గొల్వ ♦ సుఖము గలదె?
అభవుఁ డమృత స్వరూపుఁడై ♦ యలరు హరునిఁ
గొలుచు వారలె ధన్యులై ♦ పొలుచు చుండి
పరమ సౌఖ్య పదమ్మును ♦ బడయఁ గలరు. 83

శివ తవ పరిచర్యాసన్నిధానాయ గౌర్యా
భవ మమ గుణధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే,
సకలభువనబంధో సచ్చిదానందసింధో
సదయ హృదయగేహే సర్వదా సంవస త్వమ్. 84

జలధిమథనదక్షో నైవ పాతాళభేదీ
న చ వనమృగయాయాం నైవ లుబ్ధః ప్రవీణః,
అశనకుసుమభూషావస్త్రముఖ్యాం సపర్యాం
కథయ కథ మహం తే కల్పయానీందుమౌళే. 85

పూజాద్రవ్యసమృద్ధయో విరచితాః పూజాం కథం కుర్మహే
పక్షిత్వం న చ వా కిటిత్వ మపి న ప్రాప్తం మయా దుర్లభం
జానే మస్తక మంఘ్రిపల్లవ ముమాజానే న తేఽహం విభో
న జ్ఞాతం హి పితామహేన హరిణా తత్త్వేన తద్రూపిణా.

అశనం గరళం ఫణీ కలాపో
వసనం చర్మ చ వాహనం మహోక్షః,
మమ దాస్యసి కిం కి మస్తి శంభో
తవ పాదాంబుజభక్తిమేవ దేహి. 87

భువనములకెల్ల బంధువై • పొలుచు సదయు
సచ్చిదానంద సింధుసీ • సతిని గూడి
వచ్చి వసియింపు నా స్వాంత • భవనమందు
నీదు పరిచర్య కర్పింతు నిఖిల సుగుణ
ధన్యయైనట్టి నాబుద్ధి • కన్యనభవ! 84

కడలిఁ ద్రచ్చంగఁ గలిగిన • ఘనుఁడఁ గాను
త్రవ్వి పాతాళమును జొచ్చు • ఫణిని గాను
వొడిచి మృగముల వేఁటాడు • బోయఁగాను
భుక్తి భూషాంబరముల నీ • కూజసేయు
నెట్లు చాలుదుఁ జెపుము శా • శేందుమౌళి! 85.

శంకరా! నిన్నుఁ బూజింపఁ • జాలినంత
వస్తుచయమున్నఁ బూజింప • వలను పడునె?
పక్షికీట రూపముల నేను • బడయఁ జాల
నట్లు చేసిన బ్రహ్మయు • హరియు నైనఁ
జాలిరే చూడ నీశీర్ష • చరణములను. 68.

శంకరా! నీకుఁజూడ భో • జనము విషము
చర్మమే కట్టుబట్ట భూ • షణము పాము
వయసు చెల్లిన యెద్దు నీ • వాహనమ్ము
ఏమి నాకియ్యఁ గలవు? నీ • కేమి గలదు?
అభవ! నీపాదభక్తి ని • మ్మదియె చాలు. 87.

యదాకృతాంభోనిధి సేతుబంధనః
కరస్థలాధఃకృతపర్వతాధిపః,
భవాని తే లంఘితపద్మసంభవ
స్తదా శివార్చాస్తవభావనక్షమః. 88

నతిభి ర్నుతిభి స్త్వ మీశ పూజా
విధిభి ర్ధ్యానసమాధిభి ర్న తుష్టః
ధనుషా ముసలేన చాశ్మభిర్వా
వద తే ప్రీతికరం తథా కరోమి. 89

వచసా చరితం వదామి శంభో
రహ ముద్యోగవిధాసు తేఽప్రసక్తః,
మనసా కృతి మీశ్వరస్య సేవే
శిరసా చైవ సదాశివం నమామి 90

ఆద్యాఽవిద్యా హృద్గతా నిర్గతాసీ
ద్విద్యా హృద్యా హృద్గతా త్వత్ప్రసాదాత్,
సేవే నిత్యం శ్రీకరం త్వత్పదాబ్జం
భావే ముక్తే ర్భాజనం రాజమౌళే. 91

వార్ధికిఁ సేతుగట్టిన ♦ వాఁడ నేని
పర్వతేంద్రుని నడఁచిన ♦ వాఁడ నేని
బ్రహ్మాకంఠెను మించిన ♦ వాఁడ నేని
శంకరా! నిన్నుఁ బూజింప ♦ సంస్తుతింప
ధ్యాన మొనరింప దక్షుండ ♦ నగుదు నభవ. 88.

నతుల చేతను మఱియు స ♦ న్నుతుల చేత
ధ్యాన పూజా సమాధులఁ ♦ దనివి గనవు
వింటి దెబ్బలో లేక రో ♦ కంటి పోట్లో
యల శిలాఘాతములో లేక ♦ యన్య మెద్ది
ప్రియము తెలుపుము సలిపెదఁ ♦ బ్రీతి నభవ! 89

నీమహోన్నత యోగముల్ ♦ నేనెఱుంగ
నుడులచే నీచరిత్రమ్ము ♦ నుడువు చుందు
నీశ్వరా! శంభు! నీశుభా ♦ కృతిని నెపుడు
తనివి దీరంగ మనసు చేఁ ♦ దలఁచు చుందు
శిరము చేత నమస్కృతుల్ ♦ సేయుచుందు 90

రాజశేఖర! నీయను ♦ గ్రహము వలన
నాద్యమైన యవిద్య దా ♦ నంతరించె
హృద్యమౌ విద్య నిల్చెనా ♦ హృదయమందు
శ్రీకరమ్మును ముక్తికి ♦ నాకరమగు
త్వత్పదాబ్జమ్ము నెంతు మ ♦ త్స్వాంతమందు. 91.

దూరీకృతాని దురితాని దురక్షరాణి
    దౌర్భాగ్యదుఃఖదురహంకృతిదుర్వచాంసి,
సారం త్వదీయచరితం నితరాం పిబంతం
    గౌరీశ మా మిహ సముద్ధర సత్కటాక్షైః 92

సోమకళాధరమౌళౌ
    కోమలఘనకంధరే మహామహసి,
స్వామిని గిరిజానాథే
    మామకహృదయం నిరంతరం రమతామ్. 93

సారసనా తే నయనే
    తావేవ కరౌ స ఏవ కృత్యకృత్యః,
యా యే యౌ యో భర్గం
    వదతీ క్షేతే సదార్చతః స్మరతి. 94

అతిమృదులౌ మమ చరణా
    వతికఠినం తే మనో భవానీశ,
ఇతి విచికిత్సాం సంత్యజ
    శివకథ మాసీద్గిరౌ తథా ప్రవేశః. 95

నీకటాక్షముచే నీశ! ♦ నిఖిలదుఃఖ
దుష్టవాక్ దురహంకృతుల్ ♦ దురితములును
బ్రహ్మ లిఖిత దురక్షర ♦ పఙ్క్తి తొలఁగ
త్వచ్చరిత్రామృతమ్మును ♦ ద్రావు నన్ను
శంకరా! యుద్ధరింపు మీ ♦ జన్మమందె. 92

శీర్షమునఁ జందురునికళ ♦ చెలఁగు నట్టి
మేఘ కోమల కంఠమ్ము ♦ మెఱయు నట్టి
మించి లోకమ్ములను నియ ♦ మించునట్టి
శుద్ధ సాంబసదాశివ ♦ జ్యోతియందు
నెల్లపుడు నామనమ్ము క్రీ ♦ డించుఁ గాత. 93

ఏది సాంబుని వచియించు ♦ నేవిగాంచు
నేవి యర్చించు నెవఁడు స్మ ♦ రించు మదిని
నదియె నాలుక యవె కన్ను ♦ లవె కరమ్ము
లాతఁడే నిశ్చయమ్ముగ ♦ నవనియందు
నెంతయును గృతకృత్యుఁడై ♦ యెసఁగువాఁడు. 94

మృదుతరమ్ములు శివ! నీదు ♦ పదములనుచు
గరళకంధర! నామది ♦ కఠిన మనుచు
సంశయింపకు దానిపై ♦ సంచరించు
తఱిని గిరిమీఁద పడివడిఁ ♦ దిరుగుచుండు
తావక విహారసరణిని ♦ దలఁచి కొనుము. 95

ధైర్యాంకుశేన నిభృతం
రభసా దాకృష్య భక్తిశృంఖలయా,
పురహరచరణాలానే
హృదయ మదేభం బధానచిద్యంత్రైః. 96

ప్రచర త్యభితః ప్రగల్భవృత్త్యా
మదవా నేష మనఃకరీగరీయాన్,
పరిగృహ్య నయేన భక్తిరజ్వా
పరమస్థాణుపదం దృఢన్నయాముమ్. 97

సర్వాలంకారయుక్తాం సరళపదయుతాం సాధువృత్తాం సువర్ణాం। సద్భి స్సంస్తూయమానాం సరసగుణయుతాం లక్షితాం లక్షణాఢ్యాం। ఉద్యద్భూషావిశేషా ముపగతవినయాం ద్యోతమానార్థ రేఖాం। కల్యాణీం దేవ గౌరీప్రియ మమ కవితా కన్యకాం త్వం గృహాణ. 98

ఇదం తే యుక్తం వా పరమశివకారుణ్యజలధే
గతౌ తిర్యగ్రూపంతవ పదశిరో దర్శనధియా,
హరిబ్రహ్మాణౌ దివి భువి చరం తౌ శ్రమయుతౌ
కథం శంభో స్వామి న్కథయ మమ వేద్యోసి పురతః 99

త్రిపురహార! శీఘ్రముగ నాదు ♦ హృదయమనెడు
సమదగజమును ధైర్యాంకు ♦ శమున లొంచి
భక్తియను శృంఖలను గొని ♦ భవ్యమైన
జ్ఞాన యంత్రమ్ము చేతనీ ♦ చరణ మనెడు
కంబమునఁ గట్టి వేయుము ♦ కదలకుండ. 96

చిత్తమనియెడి యీగొప్ప ♦ మత్తగజము
స్వేచ్ఛ విహరింపఁగాఁ జొచ్చె ♦ నెల్ల యెడల
భక్తియను త్రాట బంధించి ♦ భయము నుడిపి
స్థిరపదమ్మునఁ జేర్పుము ♦ దృఢముగాను
భక్తవత్సల! శంకర! భవభయహర! 97

సరళపద సదలంకృత ♦ సాధువృత్త
సరస సవినయ బుధనుత ♦ చారువర్ణ
లక్షిత విశేషభూష స ♦ ల్లక్షణాఢ్య
యమల కల్యాణి ద్యోతమా ♦ నార్థరేఖ
నాకవితకన్య గొనుముమా ♦ నాథ! మాన్య! 98

పూనికిటి హంసరూపముల్ ♦ భువిని దివిని
నీదు పదశీర్షములఁ జూడ ♦ నెమ్మి మీఱఁ
దిరిగి బడలిరి గనలేక ♦ హరియు విధియు
నింక నాకెట్లు దర్శన ♦ మీయఁ గలవా?
పరమ కారుణ్యసింధు! స ♦ ద్భక్త బంధు! 99

స్తోత్రేణాల మహం ప్రవచ్మినమృషా దేవావిరించాదయః
స్తుత్యానాం గణనా ప్రసంగసమయే త్వామగ్రగణ్యం విదుః
మాహాత్మ్యాగ్రవిచారణప్రకరణే ధానాతుషస్తోమవ
ద్ధూతాస్త్వాం విదురుత్తమోత్తమఫలంశంభో భవత్సేవకాః 100

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య
శ్రీమచ్ఛంకరాచార్య విరచిత
శివానందలహరి
సంపూర్ణమాసీత్.



సత్యము వచింతు నిన్ను సం • స్తుత్యులందు
సగ్రగణ్యుగ నెంత్రు బ్ర • హ్మాది సురలు
మహిమ లెన్నడు తెలెని నో • యహి విభూష!
తమను బ్రోల్లుగ నిన్ను సా • రముగఁ గాంత్రు
ఎన్న నేనెంత చాలింతు • నింక నభవ! 100

ఇది శ్రీపరమేశ్వరకరుణా ఫలిత లలిత కవితాకలిత శ్రీరామ
లక్ష్మాంబా బుచ్చివేంకయామాత్య తనూజాత
సకల సజ్జన విధేయ ఆదిపూడి సోమనాథ
నామధేయ ప్రణీతంబైన యాంధ్ర
గోవింద మంజరీ సహిత
ఆంధ్ర శివానందలహరి
సంపూర్ణము.



శ్రీ

# జగన్నాథరాయకవి విరచితమ్.

# పతితపావనాష్టకమ్.



నచింత ఇవ లక్ష్యసే సపది మచ్చరిత్రస్మరన్
పరం కలిత సాహసః పతిత పావన వ్రతాత్
నమా మగణయః పురా నహి విచార కాలోఽధునా
వ్రతం విసృజవాధవా వరద పావయైనంజనమ్. 1

నరాఘువ నవాయసో నఖలు కృష్ణ చైద్యోఽస్త్యహామ్
నఖల్వహమజామిళో నరకనాశ నారాయణ
ప్రథాన మపరాధినాం పరిబృఢంచ మాం పాపినామ్
క్షమాజలనిధే విదన్ సపది సావధానో భవ. 2

యదుద్య దఘలేఖనా కలన జాగ్ర దగ్రాంగుళీ
మిళత్ప్రిఖన లేఖనీ ముఖ విఘాత వీతోద్యమాః
అలం కిల లలజ్జిరే సపది చిత్రగుప్తాదయః
స ఏష పతితాగ్రణీః సదయ రక్ష దక్షోఽసిచేత్. 3

కదాపిహి కథామృతం తవ మయాపి నాస్వాదితమ్
వృథా భవకథాభరై రపిచ నాథ నీతం వయః
త్వయా యదపి హేలయా మయి నచేద్విధేయా దయా
తవైవ తదపి క్షతిః పతిత పావన స్త్వం యతః 4

ఆదిపూడి సోమనాధరాయునిచేఁ దెనిఁగింపబడిన,

# శ్రీ పతితపావనాష్టకము.

## గీతములు.



పతితపావన బిరుదమ్ము ♦ పట్టినావు
తెగువచే నాచరిత్రమ్ము ♦ దెలియకుండ
వదలు బిరుదమ్ము లేద కా ♦ పాడు నన్నుఁ
జింతిలుచునున్న ఫలమేమి ♦ చెప్పుమువరద! 1

కాళ్లఁ బైఁబడ రాఘవా! ♦ గాకిగాను
దలఁపఁగాఁ గృష్ణ! చేది భూ ♦ ధవుఁడు గాను
బిలువ నారాయణా యజా ♦ మిళుఁడు గాను
బాపులకు రాజు నేను క్షు ♦ మాపయోధి!
నాచరితఁ జిత్తగింపుము ♦ నరకనాశ! 2

పతితులం దగ్రగణ్యుఁడై ♦ పరగునాదు
నఘములను వ్రాసి గంటమ్ము ♦ లఱిగి పోవఁ
జిత్రగుప్తాదు లెంతయు ♦ సిగ్గుపడిరి
ఇట్టినన్నుఁ గావు దక్షుండ ♦ వేని సదయ! 3

నీచరిత్రామృతముఁ జవి ♦ చూచియెఱుఁగఁ
గడపితిని బాపకథలందె ♦ కాలమెల్లఁ
బతితపావన! నన్నుఁగా ♦ పాడవేని
పసును దప్పెల్ల నీమీఁద ♦ భక్తవరద! 4

అనేక పతితాధిపా నవతి చక్రవర్తీ యథా
నృపానయ మసజ్జనః పతిత పావన స్త్వం నను
ఇతి ప్రతిదిశం ఖలాః పతిత పావనం మాం విదుః
నపావయసిచే దిమం నను భవేదిదం కేవలమ్ 5

అనంత యదఘావళీ మనన సావధానాత్మకైః
నిజే దురితమండలే నిఖిల సాక్షిభి ర్నేక్షితే
జనా జగతి నిర్భయా జయజయేతి జల్ప న్త్యముమ్
ప్రభో ఖిలదురంధరం పతిత పావనశ్చేదవ 6

విదన్నపి హృదంతరే ప్రతిపదం యదంహః కృతే
యతే యదుపతే నతే విఫలతా వ్రతే స్యాదితి
యతోసి జగతో గురుః స్మృతినిషేధ తస్తేతతో
ననామచ ఫణామి మయ్యయి వృథా క్రుధం మాకృథాః 7

పరిత్రాణం త్వమ్మే యదినకురుషే నాథ భవతో
నతే నాహం భీతో నహి గరళభీతో విషక్రిమిః
పరం త్వేతద్దుఃఖం పతిత జన నిస్తార జనితః
కళంకోయం సద్యో మలినయతి శుద్ధం తవ యశః 8

నృపతులను జక్రవర్తి దా ♦ నేలునట్లు
గాతుఁ బతితాధిపులఁ గాన ♦ ఖలుల వలనఁ
బతితపావన బిరుదముఁ ♦ బడసినాను
నన్నుఁ గాపాడవేని నీ ♦ కున్నయట్టి
పతితపావన బిరుదు నిఁక ♦ బాయు నధప! 5

అంతమే లేని పాపమ్ము ♦ లాచరించి
యెల్లసాధ్ముల నన్నే వీ ♦ క్షింపఁ జేసి
పాపులకు భీతిఁ బోఁగొట్టి ♦ ప్రణుతిఁ గన్న
ఖల ధురంధరుఁ గావుము ♦ కరుణనన్నుఁ
బతితజన పావనుఁడవేని ♦ ప్రభువతంస. 6

భంగమును బొందరాదు నీ ♦ వ్రతమటంచు
సలిపెదను పాపముల సదా ♦ తెలిసి తెలిసి
స్మృతి నిషేధించె గురుపేరుఁ ♦ జెప్పఁగాన
నోజగద్గురు! నీనామ ♦ ముచ్చరింప
వ్యర్థముగ నన్నుఁ గోపింప ♦ వలదు దేవ! 7

పావనుని జేయవేని నే ♦ భయముపడను
విషజనిత క్రిమికినుండు నే ♦ విషభయమ్ము
పతితపావన! నీశుద్ధ ♦ భవ్యకీర్తి
పడయును గళంకమంచు నే ♦ వగతుఁ నాధ! 8

# తప్పొప్పుల పట్టిక.

## శివానందలహరి.

| శ్లోకము. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 6 | 3 | నహాసి | వహాసి |
| 11 | 2 | భనతి | భవతి |
| 20 | 1 | మోహాటవ్యా | మోహాటవ్యాం |
| 22 | 1 | ప్రలాభా | ప్రలోభా |
| 26 | 2 | గృహీత్యా | గృహీత్వా |
| 26 | 4 | బ్రహ్మాద్యై | బ్రహ్మ్యాద్యై |
| 27 | 3 | గళస్థై | గళస్థే |
| 29 | 1 | తత్పాదాంబుజ | త్వత్పాదాంబుజ |
| 31 | 3 | నౌషద | నౌషధ |
| 60 | 4 | భయావహం | భయాపహం |
| 82 | 1 | పతే? | పతేః |
| 90 | 3 | మీశ్యరస్య | మీశ్వరస్య |

## ఆంధ్ర శివానందలహరి.

| పద్యము. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 11 | 4 | శకరా | శంకరా |
| 17 | 3 | గమల | గముల |
| 19 | 4 | విదికి | విధికి |
| 75 | 1 | అక్షిల | అఖిల |